


# నీలం 501

## డిటర్జెంట్ బార్

## తెల్లదనానికి మొదటిది, ప్రకాశానికి మొదటిది

మీరు కోరే లక్షణాలన్నీ ఉన్నాయి:

- డిటర్జెంట్ కావడం వల్ల అధికంగా ఉతికే శక్తి.
- బార్ కావడం వల్ల అధికంగా పొదుపు.
- ప్రత్యేక రీతిలో గట్టిగా తయారు చేయబడినందువల్ల తొందరగా అరిగిపోదు, ముద్ద కాదు.
- తెల్ల బట్టలైనా, రంగు బట్టలైనా ఉతికేందుకు సరిగ్గా తగినట్టిది.
- పట్టుకోవడానికి అనువుగా ఉంటుంది.

## మరొక 501 విజేత!

ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

CAST-I-223 TEL

అమ్మా, మనబీరువాలలో కూడా
ఓడోనిల్ ఎందుకు
పెడుతున్నాం?













CHAITRA-BLS-186 TEL

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 18–8–'78
కాళయుక్తి నామ సం. శ్రావణ పూర్ణిమ
*సంపుటము 71 : సంచిక 48*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60
ఆరు మాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక

## లక్ష్మి విష్ణువునే ఎందుకు వరించింది?

పాల సముద్రాన్ని మథించినప్పుడు తొలుత పుట్టిన హాలాహలాన్ని శివుడు తన కంఠంలో వుంచుకొని లోకాలను రక్షించాడు. అందువల్లనే గరళకంఠుడని పేరు వచ్చింది. గరళం పుట్టిన వెనుక కామధేనువు, కల్పవృక్షం, ఉచ్చైశ్శ్రవము, ఐరావతం, కౌస్తుభం, జ్యేష్ఠాదేవి, లక్ష్మీదేవి ఉద్భవించారు తమ యజ్ఞ యాగాదుల కోసం ఋషులు కామధేనువును తీసుకున్నారు. కల్పవృక్షాన్నీ, ఉచ్చైశ్శ్రవాన్నీ, ఐరావతాన్ని ఇంద్రుడు తీసుకున్నాడు. కౌస్తుభాన్ని విష్ణువు స్వీకరించాడు.

లక్ష్మీదేవి చక్కదనాన్ని చూచి మునులు, దేవతలు దిగ్భ్రాంతులైనారు మునులు ఆ దేవిని శ్రీసూక్తంతో స్తుతించారు విష్ణువు తప్ప తక్కినవారందరూ రెప్ప వాల్చకుండా లక్ష్మీదేవినే చూడసాగారు. జ్యేష్ఠాదేవి మీద ఎవరిదృష్టి ప్రసరించలేదు.

లక్ష్మీదేవి చేతిలో పూలమాలను ధరించి ఉంది. అంటే— ఆమె తగిన భర్తను వరించడానికి సిద్ధంగా ఉన్నదన్నమాట! దేవతలలో ప్రతి ఒక్కరూ ఆమె తన్నే వరించగలదనే ఆశ పెట్టుకుని ఆమె అనుగ్రహం కోసం ఎదురు చూస్తూ ఉన్నారు. విష్ణువు మాత్రం తటస్థంగా ఒక మూల ఉన్నాడు.

లక్ష్మీదేవి ఉత్తమ గుణాలున్నవారినే వరించాలని సంకల్పించుకొన్నది. అందువల్ల బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రాదలచుకొన్నది— ప్రతి నిర్జరుని యందూ ఆమెకు ఏదో ఒక లోపం కనిపిస్తూనే ఉన్నది.

కొందరియందు గొప్ప తపశ్శక్తి ఉన్నది. కాని కోపాన్ని నిగ్రహించే శక్తి వారిలో కనబడలేదు. కొందరికి గొప్ప జ్ఞానం ఉన్నది. కాని వారు ఇహ బంధములలో చిక్కుకొని ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. కొందరికి భక్తి ఉన్నదేకాని కరుణ ఏ కోశాన్నీ కానరాలేదు కొందరిలో త్యాగ గుణం ఉన్నది. కాని త్యాగం చెయ్యడానికి స్వాతంత్ర్యం లేదు

ఇలా ఆలోచించి, ఆలోచించి సమస్త గుణాలకూ నిలయమై ఉపేక్షా భావంతో ఉన్న విష్ణువుమెడలోనే హారంవేసి ఆయననే వరించింది.

ఇక వివాహం కావాలి. అక్క జ్యేష్ఠాదేవికి పెళ్లి కాకుండా లక్ష్మికి వివాహం ఎలా అవుతుంది? ఆ సంప్రదాయాన్ని ఎలా విడవడం? జ్యేష్ఠాదేవిని పెళ్లి చేసుకోడానికి ఎవ్వరూ సమ్మతించలేదు ఆ సమయంలో ఉద్దాలక మహర్షి ఆమెను వివాహం చేసుకుంటానని ముందుకు వచ్చాడు చెయ్యవలసిన దానికి విరుద్ధంగా చేసే స్వభావం ఆమెది. ఆమెవల్ల కలిగే కష్టాలన్నిటినీ అనుభవించగల శక్తి ఆయనకే ఉన్నది. ఉద్దాలకుడామెను పెండ్లాడిన తర్వాత లక్ష్మీ విష్ణువుల కల్యాణం జరిగింది.

కావాలని కోరే వారికి సంపద దూరమైపోతుంది. కోరనివారినే చేరుకుంటుంది

## ధర్మపథం

—ఖులుసు వేంకటరమణయ్య.

---

# ఉత్తరాలు

### అట్టపైనొాది బొమ్మ

ఈ వారం (21-7-78) ఆంధ్ర సచిత్ర వార పత్రిక అట్టపై బొమ్మ (జయప్రద) చాలా బాగుంది.

"ప్రేమించు ముక్తికై" అన్న పెద్దకథ మమ్మలను ఎంతగానో ఆకర్షించినది.

ఇకపోతే కథలలో నాకు "భయం" అన్న కథ నాకెంతో నచ్చింది.

కె. రవికాంత్ (వేదంగి)

*   *   *

21-7-78 నాటి మా (మీ) పత్రికపైని ముఖచిత్రం పత్రికకే గ్లామర్ తెచ్చి పెట్టింది.

ముఖచిత్రాలపట్ల మీ శ్రద్ధ ఎంతో సంతోషించ దగినది.

"ప్రేమించు ముక్తికై" కథ మొదటి భాగము చాల ఆసక్తిగా ఉంది.

చేకూరి వెంకటరమణరాజు, సి హెచ్. సత్యవతి,
అదేపల్లి సాంబమూర్తిరాజు, ఎ. పద్మావతి.
(అక్కయ్యపాలెం)

### మాయాజాలం మతికట్టు

23-6-78 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 'మతికట్టు మాయాజాలం' (మైండ్ రీడింగ్) భావరాజు కామేష్ బాగానే చెప్పారు. కాని అనవసరంగా గొడవ ఎక్కువగా ఉంటుంది. -మాజిక్- కొంచమే ఉంటుంది. అది తగ్గిస్తే బాగుంటుంది. పోతే గత 1, 2 వారములుగా మైండ్ రీడింగ్ రావడంలేదని ఉదాహరణలు చూపిస్తున్నారు. అదంతా అనవసరం. అయితే అర్థం చేసుకోకుండా వ్రాయడం బాగోలేదని నేను వ్రాయవలసి వచ్చింది. కారణం మీరు చెప్పే ఉదాహరణలకి జవాబు వచ్చింది. వస్తుంది. పోతే ఈవారం 21-7-78 పత్రికలో కూడా ఎవరో ఇద్దరు పాఠకులుకూడా వ్రాసేరు. అంత తప్పు ఏమీ రావటంలేదని. ఒక పాఠకుడు మరి ఘోరంగా టోటల్ 24 వస్తే $2+4=6$ అని- ఏదో వ్రాసుకుపోతున్నారు. అసలు అర్థం చేసుకోకుండా అనవసరంగా వ్రాయడం మంచిది కాదు అని నా అభిప్రాయం. ఇంకో పాఠకుడు చెప్పినట్లు తలచుకున్న సంఖ్య 8378 అనుకుంటే 9 చే గుణించగా 75402 కొట్టివేసిన సంఖ్య '0 అనుకుంటే అప్పుడు 7542. మిగిలిన అంకెల మొత్తం 18. ఇంతవరకు బాగుంది. అయితే అక్కడే పప్పులో కాలేసారు. $9 \times 1 = 9$; $9 \times 2 = 18$ కదా అందుచేత $18 - 18 = 0$ వస్తుంది. కాని $9 \times 3 = 27$ అనుకోని చేయటం పొరపాటు. తిరిగి మళ్ళీ భావరాజు కామేష్‌గారిని కమ్మకట్టడం బాగోలేదు. కాస్త ఆలోచించండి.

కె. సాయికుమార్, (విశాఖపట్నం)

### సామాన్యుని సణుగుడు

21-7-78 వారపత్రిక-సామాన్యుని సణుగుడు-శీర్షికలో శ్రీ వీరాజీగారి "మ్యాడిన్ స్క్వేర్" సామాన్యుని సణుగుడులో నేటి ప్రధాన సమస్యను బాహాటంగా విమర్శించినందుకు ఎంతైనా అభినందనీయులు ఈ విధమైన డోపిడీ మరాసంస్థలు మరెన్నో గలవు.

ఎస్. వెంకటరెడ్డి. (ఉండ్రాజవరం)

### కథలు

మా అభిమాన అందాలతార కుమారి జయప్రద గారి త్రివర్ణ ముఖచిత్రంతో వెలువడిన 21-7-78 సంచిక ఎక్సలెంట్‌గా ఉంది. కథలలో "భయం" అన్న కథ నిజంగా భయంగానే నడిచింది. మాదిరెడ్డిగారి సీరియల్ "మోహనరూప" అద్భుతంగా ముందుకు సాగిపోతుంది. పూర్తిగా తెల్లపేజీలతో వేస్తే చదవడానికి ఉత్సాహంగా ఉండగలదని భావిస్తున్నాము తర్వాత సంచిక కోసం ఎదురుచూస్తూ ఉంటాము.

చోడవరపు నాగేశ్వరరావు (సికింద్రాబాదు-3)
















## సిగ్గుపడే నీళ్లు

మీ స్నేహితుల నందరినీ ఆశ్చర్యపరచే గారడీ ఒకటి చూపించనా లల్లూ? ఇది చెయ్యడానికి కావలసిన వస్తువులు :

1. ఒక పాలసీసా 2 ఒక పలుచని జేబు రుమాలు 3. ఒక త్రాడు 4. చెంబెడు నీళ్ళు.

పలుచని జేబు రుమాలు నీళ్లలో తడిపి, పాలసీసా మూతిమీద ఒంటి పొరని పరిచి మూతిని బిగించి దారంతో గట్టిగా కట్టు. చెంబునిండా నీళ్ళు తీసుకుని, రుమాలులో నుంచి సీసాలో పడేటట్లు నీళ్ళు ధారగా పొయ్యి. అతి సులభంగా నీళ్ళు సీసాలో పడతాయి. జేబురుమాలు పలుచగా ఉండడం చేత నీళ్ళు సీసాలోకి వెళ్ళడంలో ఆశ్చర్యం ఏముందీ ?

ఇప్పుడు పాలసీసాని తలక్రిందుగా తిప్పి పట్టుకుంటే ఏమవుతుందో చెప్పమని గారడీ చూస్తున్న మీ స్నేహితులని అడిగిచూడు. సీసాలోని నీళ్ళు అన్నీ రుమాలు గుండా సునాయాసంగా బయటికి కారిపోతాయని అందరూ అనుకుంటారు. ఆ మాటే అంటారు. అప్పుడు నువ్వు మంత్రం వేసి

**శీర్షిక ప్రారంభం!**

# సైన్సులో సరదాలు

— డాక్టర్. మహీధర నళినీమోహన్.

నట్టు నటించి, చటుక్కున సీసాను తల కిందులు చేసిపట్టుకో.

ఆశ్చర్యం! సీసాలోని నీళు ఒక్కచుక్క కూడా బయటికి రావు! నువ్వు ఉపయోగించిన రుమాలులో ప్రత్యేకత ఏమీ లేదని చూపించడానికి మీ స్నేహితుల జేబులోంచి రుమాలు ఒకటి తీసుకో. సీసాగాని, నీళ్ళుగాని మామూలువే సుమా అని నమ్మకం కలిగించడం కోసం వాళ్ళకి ముందుగానే చూపించు.

అయితే సీసా లోపలికి వెళ్ళగలిగిన నీళ్ళు బయటికి ఎందుకు రావూ? రుమాలు తాలూకు దారపు పోగుల మధ్య ఉన్న




నీళ్లు బయటికి రావు

రంధ్రాలు ముందరం మామూలుగానే ఉండి తరవాత మూసుకు పోయాయా?

సీసాలోని నీళ్ళు బయటికి రాకుండా అడ్డుకుంటున్నది గాలి. సీసా తలకిందులుగా పెట్టుకున్నప్పుడు లోపల ఉన్న నీళ్ళు సీసా మూతికి బిగించికట్టిన రుమాలు చిల్లులలో నుంచి బయటికి రావాలనే ప్రయత్నిస్తాయి. కాని, చిల్లులు అన్నీ నీటితో మూసుకు పోవడంచేత బయటి గాలి సీసాలో దూరడానికి దారి లేదు. సీసా లోపలి నీటిని కిందికి లాక్కే గాలి వత్తిడి, బయటి గాలి వత్తిడి కన్న తక్కువ కావడంచేత నీళ్ళు బయటికి రావు. నీళ్ళు బయటికి రావాలంటే గాలి లోపలికి వెళ్ళి తీరాలి.

సీసాని చటుక్కున తలకిందులు చేయడానికి బదులు నెమ్మదిగా వంచితే— మూతి అంతా నీళ్ళతో నిండిపోకుండా గాలి లోపలికి వెళ్ళడానికి కాస్త దారి వదిలితే — బుళక్కు బుళక్కుమనే శబ్దంతో నీళ్ళు బయటికి వస్తాయి. ఆ చప్పుడుకి కారణం లోపలికి వెళ్ళడానికి ప్రయత్నించే గాలీ, బయటికి రావడానికి ప్రయత్నించే నీళ్ళూ ఇరుకు దారిలో ఒకదాని నొకటి తోసుకోవడమే.

సీసాలోని కొబ్బెర నూనెను గాని, మందును గాని బయటికి తియ్యదలుచుకున్నప్పుడు సీసాను కొద్దిగా వంచి, బయటి గాలి లోపలికి దూరడానికి అవకాశం ఇస్తూ ఉంటాం మనకి తెలియకుండానే. సన్నని మూతి ఉన్న అత్తరు సీసాలను వంచితే లోపలి ద్రవం బయటికి రాకపోవడం అందరికీ తెలిసినదే. సీసా మూతి పెద్దది అయిన కొద్దీ లోపలి ద్రవం బయటికి సులభంగా వస్తుంది. ద్రవం పలుచన అయిన కొద్దీ బయటికి సులభంగా వస్తుంది. ఉదాహరణకి




గాలి వత్తిడి ఎక్కువ

అత్తరు బదులు కిరసనాయిలు పోస్తే సులభంగా బయటికి వస్తుంది.

గాలి ఒత్తిడి ఒక్కటే కాక, ఈ గారడీని నడిపించిన శక్తి మరొకటి కూడా ఉంది. దానినే సర్ఫేస్ టెన్షన్ (ఉపరితలపు వత్తిడి) అంటారు. ద్రవపదార్థాల ఉపరితలము లన్నిటి మీదా పనిచేసే అదృశ్య శక్తి ఇది. ఈ శక్తివల్ల ద్రవం పైభాగాన కనిపించని పొర వంటిది ఏర్పడుతుంది. ద్రవం బయటికి పోవలసిన రంధ్రం పెద్దది అయినకొద్దీ ఈ పొర బలహీనమవుతుంది. అందుచేతనే సీసా మూతి పెద్దదిగా ఉంటే బలహీనమైన ఈ పొరని చింపుకుని నీరు బయటికి, గాలి లోపలికి ప్రవేశించగలుగుతాయి. రుమాలు తాలూకు దారపు పోగుల మధ్య రంధ్రాలు బహు చిన్నవిగా ఉండడం చేత ఈ ఉపరితలపు వత్తిడి కారణంగా నీటి పొర అన్ని రంధ్రాలనూ బలంగా మూయ గలుగుతోంది.

---

సైన్సు అనగానే సైన్సు మేష్టర్నీ, వచ్చిన మార్కుల్నీ తలుచుకుని గాభరాపడే పిల్లల్ని ఆకర్షించడానికీ, అందులో రుచి పుట్టించడానికీ, "ఓస్ ఇంతేనా!" అని వాళ్ళచేత అనిపించడానికీ, ఈ "సైన్సులో సరదాలు" సృష్టించాను. కొవ్వొత్తి, అగ్గిపెట్టె, కాగితం, గుండుసూది, సీసా, డబ్బా, రబ్బరుముక్క, పెనిసిలు, దారపుబండి, తీగ, మేకు, చాకు, ఉప్పు, నిమ్మకాయ వంటి ప్రతి ఇంట్లోనూ దొరికే అత్యల్పమైన వస్తువులతో ప్రతి పిల్లకాయా చేయదగ్గ గారడీలను ఇందులో చూపించాను. ఇవి కేవలం గారడీలు కావు. ప్రతి గారడీవెనుక ఒక శాస్త్రీయ సిద్ధాంతం, ఒక ప్రకృతి రహస్యం దాగి వున్నాయి. ఆ రహస్యాలను బయటికి లాగి చూపించడమూ, ఈ విధంగా శాస్త్రీయమైన అవగాహనా, దృష్టి పిల్లలలో కలిగించడమూ నా ముఖ్యోద్దేశం. స్కూళ్ళలో సైన్సు బోధించే ఉపాధ్యాయులు కష్టపడవలసిన అవసరం లేకుండా అతి గహనమైనవి అనుకున్న విషయాలు అతి సులభంగా ఆకర్షకంగా బోధించగలగడానికి ఇవి పనికివస్తాయని నా ఆశ.

— మహీధర నళినీమోహన్.

---

సీరియల్

# రాగద్వేషాలు

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

## 5

*(గత సంచిక తరువాయి)*

నెల రోజులు గడిచాయి. మళ్ళీ ఆ అబ్బాయి దగ్గర్నించిగానీ—వాళ్ళ నాన్న దగ్గర్నించి గానీ ఉత్తరాలే రాలేదు!

కొద్ది కొద్దిగా కోలుకుంటున్నారు, రావుగారు. తండ్రిని వదలకుండా చూసుకుంటోంది ఇందిర. కాలేజికి కూడా సెలవు పెట్టేసింది, కొన్నాళ్ళు. కొన్నాళ్ళయినాక సెలవులవే వచ్చాయి.

ఇప్పుడు మళ్ళీ కాలేజీ తెరిచారు ఇందిర ఆరోజు కాలేజీకి వెళ్ళాలని తయారయింది. తండ్రికి కావల్సినవన్నీ అమర్చింది. "నాన్నా రండి— టిఫిన్ తీసుకుందాం" అంది తండ్రితో. తండ్రి కూతురు రెడీ అవడం అంతా చూస్తూ కూచున్నారు. ఈ నెల రోజుల్నించీ ఇందిరని మరీ వదలలేక పోతున్నారు ఇప్పుడు కాలేజికి వెళ్తుందన్నా బాధగానే వుంది. అందుకే "ఇందూ ఇవాళ ఒక్కరోజూ కాలేజీ మానేయకూడదామ్మా!" చిన్నపిల్లాడిలా అడిగారు.

"ఏం నాన్నా వంట్లో మళ్ళీ ఏమన్నా నలతగా వుందా?" కంగారు పడుతూ అడిగింది ఇందిర.

"ఏంలేదమ్మా నేను బానేవున్నాను కానీ సాయంత్రం దాకా వంటరిగా వుండద్దూ నేను?" అన్నారు.

రెండు మూడు నెలల దాకా బాగా విశ్రాంతి తీసుకోవాలనీ, బిజినెస్ వ్యవహారాలయినా అత్యవసరమైతే తప్ప ఇంట్లోనే చూసుకోవాలని డాక్టరు గట్టిగా హెచ్చరించారు. నవ్వింది ఇందిర. అల్లరి చేసే పిల్లవాడిని చూసే తల్లి నవ్వులాగా వుంది. ఆ నవ్వు!

"కాదు నాన్నా! పరీక్షలు గూడా దగ్గరికి వస్తున్నాయి కదా? ఇప్పుడు పాఠాలు పోతే ఎట్లా మీరే చెప్పండి? అమ్మమ్మా, తాతయ్యా వున్నారుగా? సాయంత్రం నాలుగు గంటలవంగానే వచ్చేస్తాను. ప్లీజ్... మీరట్లా వుండద్దు. మీరట్లా వుంటే నాకు వెళ్ళబుద్ధే కాదు. వెళ్ళినా అక్కడా పాఠాల మీద మనసు నిలవదు..." అనునయంగా అంది ఇందిర.

"సరే- తల్లీ— వెళ్ళిరా!" అన్నారు అయిష్టంగానే! అప్పట్లుగా ఇందిర నాలుగు గంటలకి రాలేదు. అయిదు ఆరు అయినా రాలేదు. రావుగారికి కంగారు కలిగింది!

కాలేజీలో ఏవైనా మీటింగులుంటే ఆలస్యంగా రావడం ఇందిరకి అలవాటే! కానీ, రావుగారు తన బిజినెస్ వ్యవహారాల్లో వుండి, అవి అంతగా పట్టించుకునే వారు కాదు, ఎప్పుడూ!

> ***జరిగిన కథ 2:*** లక్షాధికారి హనుమంత రావుగారు వివాహమాడిన బెంగాలీ యువతి గీత, ఇందిరను కనిన కొంతకాలానికి మరణిస్తుంది. ఆయన అక్క సుగుణ తన కొడుకు ఫారిన్ రిటర్న్‌డ్‌ను ఇందిరకు యిచ్చుటకు ఆమె అత్త మామలు నిరాకరించారని ఉత్తరంలో విచారం వెలిబుచ్చుతుంది. ఇందిరను చేసుకునే విషయములో విశ్వనాథం వ్రాసిన ఉత్తరం హనుమంతరావుని గుండె పోటుకు గురి చేయగా, ఆయన కుమారుడు శ్రీకర్ వ్రాసిన ఉత్తరం ఊరట కల్గిస్తుంది.

కానీ ఈ రోజు ఇంట్లోనే వుండడంవల్ల, ఆమె రాకకై పొద్దుట్నించీ ఎదురు చూస్తూండడంవల్ల, నిమిషాలుగడుస్తున్న కొద్దీ, ఇందిర రాలేదనే ఆదుర్దా ఎక్కువవుతోంది, ఆయనకి!

ఏడు గంటలయింది ఇందిర రాలేదు.

ఆయన అశాంతిగా పచార్లు చెయ్యడం ప్రారంభించారు.

బయట చీకట్లు అలుముకున్నాయి.

ఆడపిల్ల, ఇంత చీకటిపడ్డా ఇంటికి రాలేదే, అసలే రోజులుకూడా మంచివికావు! ఏం జరగలేదు కదా!

చాలా టెన్షన్‌లో వున్నారు రావుగారు.

చీమ చిటుక్కుమన్నా ఉలిక్కి పడుతున్నారు.

అంతలో ఫోను గణ, గణమని మోగింది. ఎందుకో ఫోన్ ఎత్తడానికే భయంవేసింది. చేతిలోకి తీసుకున్నారు, ఫోను. ఆ ఫోన్ హాస్పిటల్‌నించి వచ్చింది.

"ఏమిటి? మా అమ్మాయా? హాస్పిటల్‌లో వుందా? ఎందుకు? ఏమయింది? చెప్పండి—చెప్పండి డాక్టర్..."

"ఏంలేదు రావుగారూ...చిన్న చిన్న దెబ్బలు తగిలాయి. మరేం కంగారులేదు. భయపడాల్సింది, అసలేలేదు. పిల్లా... ముగ్గురు ఆడపిల్లలుకలిసి, టాక్సీఎక్కారుట, సాయంత్రం ఆరుగంటలకి. దానికేమో యాక్సిడెంటయింది... ఒక లారీ గుద్దుకుందిట... కానీ ఇందిర కేమీ పెద్దదెబ్బలు తగలలేదు. షి ఈజ్ పర్‌ఫెక్ట్లీ ఆల్—రైట్... ఏం ఫరవాలేదు... అబ్బే అదేం లేదండీ... మీరు రండి— తీసుకు వెళ్దురుగాని— ఆమెని!"

అవతల డాక్టరుగారు మాట్లాడుతున్నారు,







# మీ పిల్లలకు అన్నం పుష్టికరమైన అన్నం మీ పైరుకు అన్నం విజయ్

పిల్లలాగానే పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని, భాస్వరం, పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది, అధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్‌వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయ బడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు
ఈ క్రింది వారిని సంప్రదించండి.



ఏరియా మేనేజర్
**మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్**
44, కాంతి నగర్ కాలనీ, హైదరాబాదు-500 028






### గమనిక

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు తిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.





# రాగద్వేషాలు

"నిజంగా భయం లేదంటారా డాక్టర్? నాకు ఒక్కగా నొక్క పిల్ల! వాళ్ళమ్మ కూడా లేదు. దానికేదయినా అయితే నేను బతక లేను డాక్టర్... బతకలేను. అదే నా ప్రాణం..." కంఠం గద్గదికమైంది. కన్నీళ్ళు కారసాగాయి!

ఆ డాక్టర్ తెలుగాయన.

రావుగారికి బాగా పరిచయమున్నవారే!

"నాకు తెలుసు. యూ డోంట్ వర్రీ... నేనే కాసేపాగి ఇందిరని తెచ్చి ఇంటి దగ్గర దింపి వెళ్తాను"

"వద్దండీ నేనే వస్తున్నాను. నా మనసు నిలవదు— దాన్ని చూస్తేగానీ..."

"ఆల్‌రైట్— రండయితే!"

ఫోన్ పెట్టేశారు డాక్టర్‌గారు.

తరవాత పది నిమిషాల కల్లా కార్లో బయలేరేరారు— రావుగారు.

ఆయనతోబాటు వాళ్ళ మామగారు కూడా వున్నారు.

కారు హాస్పిటల్ గేటు దాటుతుంటేనే రావుగారికి గుండె దడదడలాడింది. వళ్ళంతా చెమటలు పట్టాయి భయంతో—

ఎమర్జెన్సీ వార్డు ముందు జనమంతా గుమిగూడి వున్నారు.

కొంతమంది 'షి యీజ్ డెడ్' అంటు న్నారు. పై ప్రాణాలు పైనే పోతున్నాయి ఆ మాటతో రావుగారికి.

ఆయన మొహంలో తగని ఆతృత.

"ఇందిర— ఇంది రెట్లా వుందో?"

ఆయనలోని ప్రతి అణువూ కలవరిస్తోంది!

అంతలో

'నాన్నా—' జనంలోంచి వచ్చింది ఇందిర. ఇందిరని చూసిన ఆయనకి ప్రాణాలు లేచి వచ్చినట్టుగా వుంది!

కూతురు పునర్జన్మ ఎత్తి వచ్చినట్టని పించింది.

రావుగారికి సంతోషంగా వుంది.

"నాన్నా, రేఖ నాన్నా... నా ఫ్రెండ్ రేఖ— పోయింది నాన్నా.—"

తండ్రిని పట్టుకుని గొల్లుమంది ఇందిర

తండ్రీ కూతురు ఒకళ్ళనొకళ్ళు పట్టుకుని కన్నీరు కార్చసాగారు.

రావుగారు హృదయభారమంతా తీరేలాగ కన్నీరు కార్చారు.




ఆ తరవాత కాసేపటికి తనని తనే సంభాళించుకున్నారు.

కూతుర్ని ఓదారుస్తూ లోపలికి నడిచారు రావుగారు— కూతురి ప్రాణ స్నేహితురాల్ని చూడడానికి!

ఆ ఆక్సిడెంట్‌లో పెద్ద దెబ్బలు తగిలింది రేఖకే.

అచేతనంగా పడివున్న ఆ పిల్లని చూడలేక పోయారు— రావుగారు.

డాక్టర్లు అన్ని ప్రయత్నాలూ చేసినట్టుంది కానీ ఏదీ ఫలించలేదు.

అప్పుడే ఆక్సిజన్ కూడా డిస్కనెక్ట్ చేశారు. అంటే? అంతా అయిపోయిందన్న మాట!

'ఇంకా రేఖ తల్లిదండ్రులు రాలేదు. మెసేజ్ అందేటప్పటికే లేట్ అయింది. వస్తూ వుండాలి' ఇందిర చెప్తోంది!

అబ్బ. ఎంత హృదయ విదారకమైన సంఘటన! ఆ తల్లిదండ్రుల పరిస్థితి తల్చుకుంటేనే గుండె చెరువవుతోంది! పొద్దున పువ్వులాగా కాలేజీకి వెళ్ళిన పిల్ల! సాయంత్రమయ్యేటప్పటికి నూరేళ్ళూ నిండిపోయాయి!

ఒక్కక్షణం తననా పరిస్థితిలో వూహించుకుని వణికిపోయారు. రావుగారు!

తనకీ, తనకూతురికీ పెద్ద ప్రమాదం తప్పినట్టే!

అంతలోకే డాక్టరుగారు వచ్చారు.

"వచ్చారా రావుగారూ! నేను చెప్తే నమ్మలేదుగదూ, మీరు? ఇదిగో మీఇందిర చెక్కు చెదరకుండా వుంది!" నవ్వుతూ అన్నారు రావుగారితో.

అవతల ఆ అమ్మాయి చనిపోయివుంటే, డాక్టర్లు ఇంత నిబ్బరంగా ఎట్లా మాట్లాడగలరు? అది వాళ్ళ వృత్తిధర్మం కాబోలు! బతికున్న వాళ్ళకి ధైర్యం చెప్పాల్సిన బాధ్యత వాళ్ళదేగా?

నోరు తెరచినా మాట రావడం లేదు రావుగారికి

"అమ్మా, ఇందిరా. రెండు మూడు రోజులయ్యాక మళ్ళీ కట్టు మార్చి కడదాం. ఇదిగో ఈ ఆయింట్‌మెంట్ రబ్ చేసుకో— నొప్పులు తగ్గుతాయి. మీనాన్నగారికి కాస్త ధైర్యం చెప్పు—" అన్నారు డాక్టర్‌గారు ఇందిరతో.

ఇందిరకి చేతికీ, నుదుటికీ దెబ్బలు తగిలాయి కింద పడ్డప్పుడు [illegible] మడతబడి వాచింది. అవి అప్పుడే [illegible]

రావుగారు కూతుర్ని మళ్ళీ దగ్గరికి తీసుకున్నారు... మళ్ళీ ఆయన కళ్ళనిండా నీళ్ళు!

ఇంటికి వెళ్ళమని తొందర చేశారు డాక్టరుగారు.

రేఖ బెడ్‌వైపు సానుభూతిగా చూశారు రావుగారు.

"వుయ్ హావ్ డన్ అవర్ బెస్ట్! కానీ లాభం లేకపోయింది. అసలిక్కడికి తెచ్చినప్పుడే— షి వజ్ హాఫ్ డెడ్! వెంటనే ఆ అమ్మాయి మీదే అటెండ్ అయ్యాం. కాని అప్పటికే మించి పోయింది! ఇంకో అమ్మాయి కూడా కాస్త తీవ్రంగానే గాయపడింది. ఇంకో వారం వుండాల్సి వస్తుందామె హాస్పిటల్లో! ఇందిరే లక్కీ గర్ల్! పెద్ద దెబ్బలు తగల్లేదు..." అన్నారు డాక్టరు గారు.

ఇంకో అమ్మాయిని గూడా చూసి ఇంటికి బయల్దేరారు - రావుగారు, ఇందిర!

అప్పటికీ రాలేదు రేఖ పేరెంట్స్!

"నా కారు అదీ కావాలంటే వాడుకోండి! నేను ఏ సహాయమైనా చేస్తాను" ఇంకా ఏదో చెప్పబోయారు రావుగారు.

"అట్లాగేనండి— కావాలంటే ఫోన్ చేస్తాం" మధ్యలోనే అడ్డుకున్నారు డాక్టరు గారు.

"ఆ అమ్మాయి పేరెంట్స్ ఈపాటికి బయల్దేరే వుంటారు—"

డాక్టర్‌కి థాంక్స్‌చెప్పి ఇంటికి బయల్దేరారు. రాత్రి పదిగంటలయింది ఇంటికి చేరేటప్పటికి! భోజనం సయించలేదు. నిద్ర కూడా పట్టలేదు. రాత్రల్లా మేల్కొనే వున్నారు ఆ తండ్రీ కూతుళ్లు!

జరిగిందంతా పూసగుచ్చినట్లు వివరిస్తోంది ఇందిర! కూతురి తల నిమురుతూ వింటున్నారు రావుగారు!

'పెద్ద గండం గడిచింది! భగవంతుడి దయ!' అనుకున్నారు చివరికి అంతా విన్నాక.

## 6

"అమ్మా ఇందిరా! నేనో కోరిక కోరతాను. అది నువ్వు తీర్చాలి."

టిఫిన్ టేబిల్ మీద అంతా సర్దుతున్న ఇందిర ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటి నాన్నా అది?"

"ముందు నువ్వు ప్రామిస్ చెయ్యి. నా కోరిక తీరుస్తానని."

చెయ్యి చాచారాయన. ఆలోచించకుండానే చేతిలో చెయ్యి వేసింది ఇందిర ఒక్క క్షణం కూతురి వైపే చూశారాయన. తరువాత నెమ్మదిగా అన్నారు. "నువ్వు కాలేజీ మానెయ్యాలి! ప్రైవేటుగా చదువుకుందువుగాని! ఇంట్లోనే ట్యూషన్ ఏర్పాటు చేస్తాను. నీకేం కావాలంటే అదల్లా చేస్తాను. కాని...కానీ...ఇవాళ్టినించీ మాత్రం నువ్వు కాలేజీకి వెళ్లద్దు."

ముందు ఏమీ మాట్లాడలేక పోయింది ఇందిర.

తరువాత—

"మీ భయం నా కర్థమయింది నాన్నా— కానీ ఎప్పుడూ అట్లాగే జరుగుతుందా? పోనీ నేను మన కార్లోనే వెళ్తాను రోజూను! వచ్చేటప్పుడు కూడా అట్లాగే మన కార్లోనే వస్తాను...?" అంది.

"నువ్వేమన్నా అనుకోతల్లీ— నా భయం నాది. ఆ ఊహే భరించలేను నేను. ఏమ్మా? బి. ఏ. నే కాబట్టి ప్రైవేటుగా పూర్తి చెయ్యడానికి అవకాశం వుంది కదా? సైన్స్ సబ్జెక్ట్స్ అయితే కష్టం గానీ... ప్రతి చిన్న విషయానికి బెదిరి పోతున్నాను నేను... నన్నర్థం చేసుకోడానికి ప్రయత్నించు తల్లీ.. నీకు కావాలంటే వారానికోసారి నిన్ను శాంతి నికేతన్‌కి తీసి కెళ్తాను. కొంత 'ఆర్ట్స్' కూడా నేర్చుకోవచ్చు నువ్వు. నేనూ మరి కొన్నాళ్ళు రెస్ట్ తీసుకుని గానీ... మళ్ళీ బిజినెస్ వ్యవహారాలు చూసుకోలేను."

తండ్రి ముఖం చూస్తూ కాదనలేక పోయింది ఇందిర.

"సరే నాన్నా... మీమాట నేనూ కాదనలేను. కానీ— పరీక్ష లెట్లాగూ దగ్గరికొచ్చేశాయి. ఈ పది రోజులూ వెళ్ళనియ్యండి నాన్నా— వచ్చేయేడు మీరు చెప్పినట్టే ఇంటి దగ్గరే వుండి చదువు కుంటాను." మౌనంగానే అంగీకరించారు రావుగారు. కానీ ఇందిర చెప్పిన ఆ పదిరోజులూ గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని కాలం గడిపారు.

*　　*　　*

పరీక్షలైపోయాయి ఇందిరకి. పరీక్షలవంగానే ఊళ్ళు తిరిగి వచ్చింది తండ్రితో కలిసి! డార్జిలింగు, ఆ తరువాత కాష్మీరు వెళ్ళారు రావుగారు కూతురితో విశ్రాంతి కోసం.

1_ మధుర, కన్యాకుమారి, రామేశ్వరం,



లోతైన నీళ్లలో పరిశోధనలు చేసే పరికరం ఆర్గస్

సముద్ర గర్భంలో పరిశోధనలు జరిపే నిమిత్తం సోవియట్ శాస్త్రవేత్తలు ఒక కొత్త రకం సాధనాన్ని రూపొందించారు.

రా గ

తిరుపతి, భద్రాచలం లాంటి పుణ్యక్షేత్రాలు దర్శించారు మనశ్శాంతి కోసం!

ఆ తరువాత కాలేజీలు తెరిచినా ఇందిర కాలేజీలో చేరలేదు. ప్రైవేటుగానే బి ఏ. చివరి సంవత్సరం చదివి క్లాసు తెచ్చుకుంది! శాంతి నికేతన్‌కి వెళ వస్తూ చిత్రలేఖనం నేర్చుకుంది. ఇంట్లోనే వుండి సంగీతం నేర్చుకుంది. కర్నాటక సంగీతంతో బాటు— హిందుస్తానీ సంగీతం కూడా వచ్చింది ఇందిరకి.

ఇంట్లో కూర్చున్నందుకు తనకేదో తక్కువయిందని ఇందిర అనుకో కూడదు. ఇది రావుగారి ఆలోచన. కాలం యథావిధిగా గడిచిపోతూనే వుంది! ఇందిర దగ్గరుండి శ్రద్ధగా తండ్రిని చూసుకోవడంతో రావుగారు ఆరోగ్యంగానే ఉంటున్నారు.

మళ్ళీ కాస్త తీవ్రంగా వరాన్వేషణ ప్రారంభించారు.

ఈ సారి ఏ వీరయ్యలద్వారానూ ప్రయత్నించదలుచుకోలేదు రావుగారు. వీరయ్య లాంటివాళ్ళు ఏ సంబంధమూ కుదరనివ్వరు. ఏ పెళ్లీ జరగనివ్వరు.

## సముద్ర గర్భంలో మర మనుషులు

దాని పేరు ఆర్గస్. ఇది ఎలా పనిచేస్తుందో చూడడానికి నల్ల సముద్రంలో అనేకవందల మీటర్లలోతునదింపి పరిశోధనలు జరిపారు. ఫలితాలు ఎంతో ఆసక్తికరంగా ఉన్నాయి.

ఈ సాధనంలో ఎన్నో సున్నిత, అధునాతన పరికరాలు, హైడ్రో— ఆప్టిక్స్, టెలివిజన్ కెమెరాలు వున్నాయి. ఈ జలాంతర్గామికి అమర్చిన రెండు ఎలక్ట్రో మోటార్లవల్ల యిది గంటకు రెండు నాట్ల వేగంతో సముద్రంలో ప్రయాణం చేయగలదు. ఇది సముద్ర గర్భంలో మూడు రోజులు ఉండగలదు. నిజానికి ఇందులో వున్న స్టోరేజ్ బ్యాటరీలు, ముగ్గురు సిబ్బందికి సరిపడా వున్న ప్రాణ వాయువు పరికరాలు, ఆహార పదార్థాలు, నీరు— వీటన్నింటి మూలంగా యిది నీటిలో ఎక్కువ రోజులు ఉండగలదు. దీని బరువు పది టన్నులు. ఈ జలాంతర్గామిలో 'స్కాట్', మాంటా—1500 అని రెండు రకాల రోబట్లు (మరమనుషులు) ఉన్నాయి. వీటిలో కంప్యూటర్లు అమర్చబడ్డాయి. అందుచేత ఇవి మనుషులకన్నా వేగంగా విధులు నిర్వర్తించగలవు. ఉదాహరణకు, స్కాట్ శిలల నమూనాలను, ఆల్గే, చిన్న చేపలను సేకరించగలదు. టెలిఫోన్ తీగలను బాగు చేయగలదు. నీళ్ళలో డ్రిల్లింగ్ పనులు చేయగలదు. స్కాట్ రోబట్‌కు శక్తివంతమైన సెర్చిలైట్లు, స్కానింగ్ టి. వి. కెమేరా, ఫోటో సెల్స్, సైంటిఫిక్, నేవిగేషన్ పరికరాలు అమర్చబడ్డాయి.

రెండవ రోబట్ మాంటా—1500 చూడటానికి లూనోఖోద్ (చంద్రుని మీద దిగిన స్వయం చాలిత పరికరం)లావుంటుంది. ఇది సముద్ర గర్భంలో సంచరిస్తూ ఎంతో విలువైన సమాచారాన్ని సేకరించి పంపుతుంది.

---

# ద్వేషాలు

ఆ పెళ్ళి కాస్తా జరిగిపోతే తనకి డబ్బు, దస్కాలు, తిండీ, తిప్పలూ ఎక్కడ్నించి వస్తాయి ? ఎట్లాకుదుర్తాయి ?

ఉన్న సంబంధం, కుదురుతున్న సంబంధం, కాకుండాచేస్తే, మళ్ళీ తిరిగి సంబంధాలు చూసే నెపంతో, రోజుల తరబడి తిష్టవెయ్యొచ్చు, బాగా తినొచ్చు, దారి ఖర్చులకంటూ డబ్బొ లాగచ్చు, ఇదీ అట్లాంటి వాళ్ళ తత్వం.

అది ఇన్నాళ్ళకి అర్థమయింది రావుగారికి.

తనకు తెలిసిన స్నేహితుల ద్వారా సంబంధాలు వెతకడం ప్రారంభించారు.

దాంతో బాటు పత్రికలలో 'మాట్రిమోనియల్' కాలమ్స్ చూడడం కూడా మొదలు పెట్టారు. చూడగా, చూడగా దాంట్లో ఒకటి రెండు ఆయన్ని ఆకర్షించాయి.

వరుడు అమెరికాలో పెద్ద ఉద్యోగంలో వున్నాడు. నెలకి వేలకి వేలు సంపాదిస్తున్నాడు. తల్లి, తండ్రి. ఇండియాలోనే వున్నారు...

తెలుగు బ్రాహ్మణ కుటుంబానికి చెందిన బ్రహ్మచారి, అతడు !

పిల్ల బ్రాహ్మణ కుటుంబానికి చెంది వుండాలి. (ఏ తెగ అయినా ఫరవాలేదు) చదువుకున్నదై వుండాలి. ఇంగ్లీషు బాగా మాట్లాడగలిగి వుండాలి. అంద చందాలు వున్న పిల్ల కావాలి ! ఉత్తర ప్రత్యుత్తరాలు ఇంగ్లీషులోనే జరగాలి! ఇది ఒక ప్రకటన—

ఇంకొకటి— వరుడు ఈ దేశంలోనే వున్నాడు. కానీ ఫారిన్ వెళ్ళే చాన్సులు వున్నాయట ! ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. పిల్ల చదువుకున్నదై శాఖాహారి అయితే చాలునట — ఏకులమైనా అభ్యంతరం లేదుట!

ఈ రెండూ కూడా రెండు — మూడు సార్లు చదివారు రావుగారు. రెండు ప్రకటనలనూ కట్‌చేసి తన టేబిల్‌మీద పెట్టుకున్నారు.

రెండు—మూడు రోజులు అదే పనిగా ఆలోచించారు. ఆలోచించగా— ఆలోచించగా మొదటిదే నచ్చిందాయనకి. పోనీ ప్రయత్నిస్తే—? అనిపించింది. చివరికి కూతుర్ని పిల్చి చూపించారది. ఇందిర చూసి మౌనంగా వుండిపోయింది.

"ఏమ్మా. ఏమంటావు? నువ్వు సరే అంటే— పోనీ ట్రై చేసి చూద్దాం—?"

ఆశ కదలాడింది ఆయన కంఠంలో.

"సరే నాన్నా— మీ ఇష్టం— కానీ..

ఆగిపోయింది.

"ఏమిటమ్మా ?"

"ఏంలేదు. మన విషయమంతా ముందే వాళ్ళకి తెలియజేస్తే...దాని కిష్టమయితేనే ముందుకు వస్తారు. లేదా ముందే మానేస్తారు."

"అవునమ్మా నువ్వు చెప్పిందే మంచిది. అట్లాగే చేస్తాను. ఇవాళే రాయమంటావా ? నీకిష్టమేగా తల్లీ ?"

తల వూపింది ఇందిర.

ఆరోజే ఉత్తరం రాసి పోస్టు చేశారు రావుగారు. అందులో తమ కుటుంబ విషయాలన్నీ దాచకుండా రాశారు.

ఇందిర తల్లి గురించి ప్రత్యేకంగా వివరంగా రాశారు. తిరుగు పోస్టులోనే జవాబు వచ్చింది.

వాళ్ళకి అన్నీ నచ్చినాయనీ పిల్ల తల్లి అన్యకులస్థురాలైనా అంత పట్టింపు లేదనీ పిల్ల ఫొటో ఒకటి పంపమనీ రాశారు.

వాళ్ళ కుటుంబ విషయాలన్నీ వాళ్ళు రాశారు. వాళ్ళది బెజవాడ దగ్గిర పల్లెటూరుట. తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకుట ! ఆడపిల్లలు ఇద్దరు. వాళిద్దరికీ పెళ్ళిళ్ళయి పోయాయట! ఈ అబ్బాయి అయిదారేళ్ళనించీ అమెరికాలో వున్నాట్ట ! ఇన్నాళ్ళూ పెళ్ళి వద్దని కూర్చున్నాడట ! వీళ్ళు రాయగా రాయగా ఇప్పటికి ఒప్పుకొన్నాడట ! రెండు నెలలు సెలవు పెట్టి వస్తున్నాడట. సంబంధం కుదిర్చి రెడీగా వుండండి. పెళ్ళి చేసుకుని మళ్ళీ వెళ్ళిపోతాను' అని రాశాడట వాళ్ళకి.

వాళ్ళకీ వ్యవధి లేనందువల్ల పేపర్లో ప్రకటన వేశారుట !

పెద్ద ఆస్తిపాస్తులు లేకపోయినా భుక్తి కేమీలోటులేదు

ఇవీ వాళ్ళ వివరాలు .

ఆ ఉత్తరం చూసినరావుగారి సంతోషం. అంతా, ఇంతాకాదు. 'జీవితంలో మొదటిసారిగా అంత ఆనందంలో తేలిపోయానేమో' అనిపించిందాయనకి ! భార్యపోయాక ఆయన జీవితంలో ఆనందపడ్డ క్షణాలు నిజంగా తక్కువే !

(50వ పేజీ చూడండి)

# 1978 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము... పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

## ముగింపు తేదీ 16-9-'78 శనివారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **600**, రు. **500**, రు. **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.

★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.

★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.

★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండితీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.

★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయంతోనే వేస్తాము

★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫోటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి వాటి ప్రచురణకు అంగీకరించాలి.

★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము పోటీకి పంపిన కథలను ఏటి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము

సం॥

# ఫాలాక్షుని డైరీ

## పోలీసుశాఖ నిర్వహించిన దొంగతనం!

అలహాబాదులోని స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో తాప్పిన దోపిడి జరిగిందట. ముసుకేసుకున్న ముఖాలవాళ్ళు మూటలు పుచ్చుకుని మటుమాయమయ్యారట. పోలీసులు రంగంలో దూకి ఆ ముఠా నగర పరిహద్దు దాటేలోగా పట్టేశారట. తీరా ముఠాకు ముసుగు తీసి చూస్తే వారూ పోలీసులేనట. ఔరా! ఔరాకాదు ఈ విభాగం పోలీసు ఎంత చాకచక్యంగా దొంగలను పట్టేది నిర్వహిస్తోందో ప్రత్యక్షంగా చూడాలని పోలీసుశాఖ యీ దొంగతనాన్ని నిర్వహించిందట. ఛోరు నేడిచినట్టుందా? తప్పులా అనరాదు. తేడా !

సౌదీ అరేబియాలో ఒక వుద్యోగానికి భారతదేశానికి చెందిన వానికి అయిదువేల రూపాయలు జీతం యిస్తే, అదే వుద్యోగానికి సౌదీ అరేబియాకి చెందిన వ్యక్తికి పదిహేను వేల రూపాయలు జీతమట. ఏమది? వాళ్ళిష్టం.

## తండ్రిని రాళ్ళతో కొట్టి చంపిన తనయుడు

ధర్మపురి జిల్లా అరూరు తాలూకాకు చెందిన దొక్కుం పట్టి అనే గ్రామంలో 24 ఏళ్ళ చిన్నసామికి, అతని తండ్రి 55 ఏళ్ళ రామసామికి ఏదో కలహం వచ్చిందట. ఆ వాగ్వాదనలో వున్నట్టుండి పిచ్చిపట్టిన వాడిలా చిన్నసామి రాళ్ళతో తన తండ్రిని, అడ్డొచ్చిన మేనమామను, మరో చూపరిని కొట్టి చంపేశాడట. ఆ ముగ్గురు అక్కడే రక్తపు మడుగులో విలవిలా తన్నుకుని చనిపోయారట. ఆ చిన్నసామి అంతతో ఆగక తన పెత్తల్లి, తల్లి మొదలైన మరో ముగ్గురాడవాళ్ళని కూడా చితక బాదాడట రాళ్ళతో. ముగ్గురాడవాళ్ళు విపరీతమైన గాయాలతో ధర్మపురి ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారట.

## పాక్‌లో జైళ్ళకు వెయిటింగ్ లిస్టు!

పాకిస్థాన్‌లోని చెరశాలలన్నీ భర్తీ అయ్యాయట. దేశంలోని ఏ జైలు ఖాళీ లేదట. తత్ఫలితంగా ఖైదీల వెయిటింగ్ లిస్ట్ వంటిది తయారుచేయాల్సి వచ్చేలా వున్నదట.

## నిరుద్యోగుల అభివృద్ధి!

భారతదేశం మొత్తంమీదున్న "ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్" లలో వుద్యోగార్థం తమ పేరులు 1977 డిశంబరు నాటికి నమోదు చేయించుకున్నవారి సంఖ్య ఒక కోటి, ఎనిమిది లక్షల, నలభై తొమ్మిది వేల మూడొందలిరవై ఆరట. ఇది 1976 సంఖ్యకు పన్నెండు శాతం ఎక్కువట. ఈ ఎక్స్ఛేంజిలను నమ్మక, తమ కాలిక్షిమీద నమ్మకముంచి తిరిగినవారెందరో? వా...రందరికీ...

### అత్త పోరు — ఆత్మహత్య

సేలం జిల్లాకు చెందిన మెక్డొనాల్డ్ చౌల్ట్రీ అనే వూరిలో చేనేత పని చేసే వరదరాజన్ అనే అతని భార్య 25 ఏళ్ళ కందాయిని అతని తల్లి రాసి, రంపాన్న పెట్టేదట. ఈ అత్త పోరు భరించలేక, వేరే దారిలేక, కందాయి గచ్చు కప్పులిని ఆత్మహత్య చేసుకున్నదట.

### కుమారుని ప్రేయసికి వాతలు !

తమిళనాడుకు చెందిన లాల్‌గుడి తాలూకా కల్లక్కుడి గ్రామంలో 35 ఏళ్ళ చెల్లప్ప అనే అతని భార్య 30 ఏళ్ళ కామాక్షి అనే ఆమె అదే వూరుకు చెందిన కూత్తప్పవాడయారు అనే ఆయన కొడుకు దొరైతో రహస్య ప్రేమాయణం పెట్టుకుని పొలాలలోనూ ఎక్కడ వీలు దొరికితే అక్కడ కలుసుకుని, కోర్కెతీర్చుకుంటోందిట. ఈ విషయం కూత్తప్పవాడయారుకు తెలిసి బజారులో సరుకులు కొంటున్న కామాక్షిని తమ ఇంటికి ఆహ్వానించి యింటికి తీసుకువెళ్ళి అక్కడ ఆయన, తన భార్య సహాయంతో కామాక్షిని నగ్నంగా చేసి, స్థంభానికి కట్టేసి రెండు స్థనాలమీద, పిరుదులమీద, తొడల మీద, మర్మావయవంమీద ఎర్రగా కాల్చిన యినప కమ్మితో వాతలు పెట్టాడట.

### కరుణానిధిపై హత్యానేరం

తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి కరుణానిధి తనను హత్య చేయప్రయత్నించారన్న నేరం తమిళనటుడు, నిర్మాత యస్. యస్. రాజేంద్రన్ ఆరోపించారట. ఈ కేసు మద్రాసు కోర్టులో విచారణ జరుగుతోంది. రాజేంద్రన్ ఒకనాటి డి.యం.కె. పార్టీ మీటింగుకు తాను వెళ్ళినపుడు జరిగిన ఘర్షణ, నువ్వు ప్రాణాలతో బయట పడవు సుమా అని కరుణానిధి అన్నమాటలు, తానాగదిలోంచి పారిపో ప్రయత్నించేసరికి తోటి సభ్యులు తనను తన్నిన తన్నులు, తలుపు విరగకొట్టితాను బయటపడి, గోడదూకి రోడ్డు చేరిన వైనం, సభ్యులు తన మీద రాళ్ళు విసిరిన విషయం, వొళ్ళంతా తనకు రక్తపు ముద్ద యిన వుదంతం అంతా కోర్టుకు విన్నవించారట.

### నడిరోడ్డుపై ముద్దు !

నంద్యాలలో వో విద్యార్థి రోడ్డున పోతున్న వో అమ్మాయిమీదకెగిరి విజృంభించి చప్పున ముద్దెట్టుకుని, అంతతో ఆగక ఆమె బుగ్గ కసక్కున కొరికాడట. ఈ విషయంలో కోర్టు వారు కలుగజేసుకుని ఆ పిల్లను ముద్దు పెట్టుకున్నందుకు, బుగ్గ కొరికినందుకు అతనికి రెండొందల యాభై రూపాయలు జరిమానా విధించింటట. *

## ఈనాటి వనితాలోకం

# నవలలు - సినిమాలు చేస్తున్న అన్యాయం

ఆ మధ్య నేను ఒక నవల చదివాను. దాంట్లో ఒక యువతి, యువకుడు ప్రేమించు కుంటారు. ఆ యువకుడు ఆమెకి అన్యాయం చేసి పోతాడు. కానీ, ఆమె మాత్రం నీవే నాకు దిక్కు అతని పేరే స్మరిస్తూ చివరి వరకు ఉండిపోతుంది. చివరికి నవల సుఖాంతం. ఇది కుప్తంగా దాని కథ. ఇదేకాదు ఇంచుమించు ఇలాంటి ఇతివృత్తంతోనే ఈ కాలంలో చాలా నవలలు వెలువడుతున్నాయి. అంటే తను ప్రేమించిన వాడు దుష్టుడైనా, దుర్మార్గుడైనా వాడే దిక్కు అని సారాంశం అన్నమాట!

విచిత్రం ఏమిటంటే, ఇలాంటి నవలలు రాసేవారు చాలా మంది 'రచయిత్రులే'. మరోవిధంగా చెప్పాలంటే మహిళల వ్యక్తిత్వాన్ని, స్వతంత్ర దృక్పధాన్ని పాతాళానికి తొక్కేసి, మహిళలే మహిళలకి దాస్య శృంఖలాలు తగిలిస్తున్నారు. అందుకనే వారాల క్రితం ఇదే శీర్షికలో ఒక రచయిత్రి 'స్త్రీకి స్త్రీయే శత్రువ'ని రెండు వారాల క్రితం ఇదే శీర్షికలో ఒక రచయిత్రి అన్నారు.

నవలలే ఇలా ఉంటే ఇక సినిమాల సంగతి వేరే చెప్పఖర్లేదు! చాలా సినిమాల్లో కథానాయికకి స్వతంత్ర వ్యక్తిత్వం అంటూ ఉండదు. "నాథా! నీవు తప్ప వేరే దిక్కు నాకు లేదు" అని కథానాయకుడి కాళ్ళు పట్టుకుంటుంది. ఈ పంథాలో ఈమధ్య అనేక చిత్రాలు వచ్చాయి నేను ఈ మధ్య చూసిన ఒక సినిమాలో హీరో వ్యసనాలకి దాసుడౌతాడు. అతని సహధర్మచారిణి అతన్ని పల్లెత్తుమాట అనదు. చిత్రం చివరిదాకా ఘోరున విలపిస్తూ ఉంటుంది అంతకు మించి మరేమీ చెయ్యదు. చివరికి అతగాడే జాలిపడి వ్యసనాలకి స్వస్తి చెబుతాడు. ఈ విధంగా పురుషుడి జాలి, దయాధర్మాలపై ఆధారపడేవారిగా స్త్రీలని చిత్రిస్తున్నారు. "హైందవ స్త్రీకి తన భర్త చరణారవిందాల వద్ద ఒక్క చదరపు సెంటీమీటరు స్థలంకన్నా మరేం కావాలి?" లాంటి డైలాగులు అడుగడుగునా గుప్పిస్తున్నారు.

ఈ రోజుల్లో బహుళ ప్రజాదరణ పొంది, ప్రజల్ని ఎక్కువగా ప్రభావితం చేస్తున్న నవలా, సినీ రంగాల ద్వారా మహిళల వ్యక్తిత్వాన్ని మంటకలిపే విధంగా పాత్రల్ని సృష్టించడం మొత్తం మహిళాలోకానికే తీరని అవమానం. ఎంత వద్దనుకున్నా నవలలు, సినిమాలు (ఇలాంటివి) పాత భావాలను ప్రజల్లో నాటే ప్రమాదముంది. ఈ రకమైన సినిమాలు, నవలల వల్ల తాము పురుషుల కన్నా తక్కువనే 'ఇంఫీరియర్ కాంప్లెక్స్' స్త్రీలలో ఏర్పడవచ్చు. చెవిలో ఇల్లు కట్టుకుని ఇలాంటి దాస్యభావాలు నవలలు నూరిపోస్తుంటే స్త్రీలలో మరి విశాల దృక్పథం ఏర్పడడానికి, ఆలోచనా పరిధి పెరగడానికి అవకాశం ఎక్కడుంది? స్త్రీలు వెనకబడడానికి ఇది ఒక బలీయమైన కారణం కావచ్చు!

"కొత్త సీసాలో పాతసారా" అనదగిన ఇలాంటి బూజు పట్టిన భావాల నుంచి స్త్రీలు ఎప్పుడు విముక్తి పొందుతారో? నవలా ప్రపంచం, సినిమా రంగాలు స్త్రీల వ్యక్తిత్వాన్ని గుర్తించేది ఎప్పుడో?

ఇంట గెలిచి రచ్చగెలవమన్నట్టు, ముందుగా స్త్రీలందరూ ఏకమై, ఈ దాస్య వ్యవస్థని ప్రతిఘటించాలి తమ తీవ్ర వ్యతిరేకత తెలియజేయాలి

— శ్రీమతి జి. ఎస్. ప్రభావతి.

[ తాడేపల్లిగూడెం ]




### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.

# వంటలు

## మొక్కజొన్న పొత్తు గారెలు

కావలసిన వస్తువులు :— 6 పొత్తులు, పావు కె జి. పెసరపప్పు, తగినంత కారం, నూనె.

తయారుచేయు విధానము :— పొత్తు గింజలు వలిచి మెత్తగా దంచి వుంచుకొన వలెను. పెసరపప్పును ఒక గంట ముందుగా నానబెట్టి, నీరు లేకుండా మెత్తగా రుబ్బిన తరువాత దంచి ఉంచిన పొత్తుల ముద్దను వేసి మరల రుబ్బ వలెను. రుబ్బిన ముద్దలో తగినంత కారమువేసి ఉంచవలెను. బాణలిలో నూనెవేసి, కాగిన తరువాత, ఆ ముద్దను చిన్న ఉండలుగా చేసి ఆకుపై వరచి నూనెలో ఎరుపు రంగు వచ్చేవరకు వేయించ వలెను. ఇవి వేడిగా ఉన్నప్పుడు తింటే చాలా బాగుంటాయి.

— కె. మాలతి, విశాఖజిల్లా.

## శెనగపిండి దోసెలు

కావలసిన వస్తువులు :—శెనగపిండి పావుకేజీ. ఉప్పు, కారం తగినంత, 2 ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, కొంచెంనూనె, కొంచెం జీలకర్ర.

తయారు చేయువిధానము :—శెనగపిండి పురుగులు చెత్త చెదారం లేకుండ జల్లించుకొని తగినంత ఉప్పు ఒకచిన్న చెంచా కారం, జీలకర్ర వేసి నీళ్ళతో గరి బెజారుగ పిండి కలుపుకోవాలి (మనం దోసెలుకు కలుపుకున్నట్లు) ఆ తర్వాత పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు, అల్లం చిన్న ముక్కలుగా తరుక్కొని పెట్టుకోవాలి· పెనం బాగా కాలినతర్వాత కొంచెంనూనెవేసి కలుపుకున్న పిండిని దోసెల పెనంమీద కొంచెంవేసుకుని దానిపైన ఈ ఉల్లిపాయముక్కలు పచ్చిమిరపముక్కలు అల్లం అద్ది రెండువైపుల బాగ కాల్చి తీస్తే (పెసర అట్టులా పొయ్యాలి) వేడిమీద తింటే చాలా బాగుంటాయి. చల్లారేక మజ్జిగఅన్నంలో కాని నూనెవేసుకొని అన్నంలోకి ఆధరవుగా తింటే కూడ రుచిగాఉంటాయి. పావుకేజీకి 4, 5 అట్లు అవుతాయి.

— ఎస్. లక్ష్మి

**వి. ఆర్. ఆర్ — కలకత్తా**

చదువుకి సంస్కారానికి సంబంధం వుండంటారా?

★ ఉండాలి మరి!

**ఆనారా — ఖర్గపూరు**

శిల్పాలు చెక్కే శిల్పకారుడు, బొమ్మలు గీసే చిత్రకారుడు, మధువు సేవించే భగ్నప్రేమికుడు వీరిపై మీ అభిప్రాయం ఏమిటి?

★ పనిచేసే పైయిద్దరిమీదా పడి తినే త్రాగుబోతు భగ్నప్రేమికుడు. అలాంటివారిపై నాకు సింపతి లేదు. ప్రేమ భగ్నమైనంత మాత్రాన బాధ్యతలు తప్పించుకోవటం ఏం న్యాయం?

**విన్ ఎల్. — అంగలూరు**

స్త్రీకి స్త్రీయే శత్రువు అంటారు. మీలాంటి వారిని చూసేనా సామెత మారదేం?

★ ఇది మరీ బాగుంది. ఓ పిచ్చి కోయిల కూసిందని వసంతం వచ్చేయిమంటే — వచ్చేస్తుందా — మండువేసవిలో!

**పి. ఎస్ ఆర్. — దేవులపల్లి.**

పరిస్థితుల ప్రాబల్యంవల్ల చూడని స్త్రీని వివాహమాడితే...

★ ఇది మరీ వింతగా వుంది శేషగిరీ. పెళ్ళిచూపుల పంకన నలభై ఏభయి మంది పిల్లల్ని చూసే నేటి యువకులా చూడని స్త్రీని పెళ్ళాడ్డం!

**జి. ఆర్. కె. — మంచిర్యాల.**

పదివేలో పదిహేనువేలో పోసి ఆడది మగవాడిని కొనుక్కుంటుంది. కాని అతనికి కోపం వస్తే ఆమెని యీచెంపా ఆచెంపా వాయిస్తాడు. అదే ఆడది ఆపని చేయలేదు ఎందుకు?

★ సభ్యత తెలిసినది కనుక!

**పి. ఎస్. — చెల్లూరు.**

మీ భర్తగారు ప్రేమ కవిత్వం స్వీటుగా రాస్తున్నారు. కారణం మీరా? లేక మీ పక్కింట్లో ఎవరేనా?

★ ఏం కాదు! వారు రోజూ స్వీటు లేకపోతే భోజనం చెయ్యరు!

**ఎ. కె — కర్నూలు.**

బులుసు వెంకట రమణయ్యగారు అచ్చటనే వున్నారు కదా! మీరు వారితో పురాణ కాలక్షేపం చేస్తుంటారా?

★ బులుసువారు పెద్దలు. వారిముందు నేనిలా కుప్పిగంతులు వేయడానికి — వెర్రిదాన్నా! వారి ధర్మపథం నాకెంతో యిష్టం. పది వాక్యాలలో పదిహేను సంపుటాల విజ్ఞానాన్ని యిముడ్చుతారు.

**ఎమ్. డి. ఎన్. ఆర్. — ఖమ్మం.**

మీరు వచ్చే జన్మంటూ వుంటే ఆడజన్మ ఎత్తదల్చుకున్నారా? మగ జన్మ ఎత్త దల్చారా?

★ నా వచ్చేజన్మకేనా ఆడదాని బ్రతుకీ భూమ్మీద మారదంటారా? ఆడదాన్నయే పుడతాను.

# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

**హెచ్. బి; జి. పి. డి. — జాల్నా.**

మీరు మగవారిని మాటి మాటికి దూషిస్తారెందుకు?

★ పొరపాటు. అలా అస్తమానూ దూషిస్తేఈ సరికి ఎప్పుడో గుడ్డిదాన్ని అయిపోయే దాన్ని కదా! (పెద్దలను దూషిస్తే కళ్ళు పోతాయి కదా! పురుషులను మించిన పెద్దలు స్త్రీకి వుండరు కదా!!)

**బి. పి. — సీతారాంపల్లి.**

నాకు వివాహమై మూడు సంవత్సరాలైంది. నాకు క్రీస్తుమతం యిష్టం. పేరు కూడా మార్చుకోవాలను కుంటున్నాను. దీనికి నా సతీమణి పూర్తిగా భిన్నం. ప్రతి శనివారం వెంకటేశ్వరాలయానికి వెడుతుంది. నాతో చర్చికి రమ్మంటే రాదు.

★ ఈ దేశంలో ఎవరి మతం వారు అవలంబించే స్వేచ్ఛ వుంది. మీ నమ్మకాలు — మీభార్య అయినంత మాత్రాన ఆమెపై రుద్దే హక్కు మీకు లేదు. మీరు చర్చికి వెళ్ళండి. ఆవిడ గుడికి వెడుతుంది.

## చరమాంకం

— వేమకోటి

నటించలేను; నటించలేను
ఈ జీవితం మధ్య ఉండలేను
నిజాయితీ లేని నిండు గుండెలమధ్య
మమకారంలేని మానవతల మధ్య
నేను మనలేను; ఏమనలేను
నాలో ప్రవహిస్తున్న చీమూనెత్తురు,
యినాళ్ళుగా జ్వలించిన మేధస్సు
యివన్నీ ధర్మ గ్రహణంలో
చిక్కుకున్నాయి
స్వార్థం, సంస్కారాన్ని ముద్దు
పెట్టుకుంటూ,
సమాజానికి అహం రంగు
పులుముతోంది
నేను దానికి బానిస కాకుండానే
పలాయనమే చరమాంకమని
తెలుసుకున్న జీవితంలో
నేను నటించలేను; మరి నటించను

**పద్మ: — పాలకొల్లు!**

ఆశలు పెంచుకోవడం మానవుడి మొదటి లక్షణం అయితే వాటిని ఆదిలోనే తుంచివేయడం దేవుని లక్షణమా? అభిమతమా?

★ దేవుడు ఆశలు పెంచడు; తుంచడు. అసలు దేవునికీ మనిషి పుట్టుకకీ — సంబంధం ఏమిటి? మీవిశ్వాసంతో మీరు దేవుణ్ని సృష్టించుకుంటారు. మీకై మీరు ఆశలు పెంచుకుంటారు. అవి నెరవేరే ఆశలుగా ఎందుకు పెంచుకోరు అని దేవుడే అడిగే ప్రమాదం వుంది సోదరీ. ఆశ అన్నది మానవాభ్యుదయానికి తొలిమెట్టు. ఆశే లేకపోతే మనిషి ముందుకి సాగుతాడా?

**యు. వి. — ఎమ్మిగనూరు.**

రచయితలకు రచయిత్రులకు ఏమిటి తేడా?

★ ఏం లేదు. ఇద్దరూ రాసేవారే.

నేటి రచయిత్రులకు మీరిచ్చే సందేశం ఏమిటి?

★ నేనేం బాబానీ, అమ్మవారినీనా? సందేశాలు పంచడానికి! అయినా రచయిత్రులకు సందేశాలక్కరలేదు — కాగితాలూ కొత్త పత్రికలూ కావాలి!

**ఎమ్. వి. ఆర్. — మంథని.**

మానవులు అలవరచుకొంటున్న ఈ అతి నాగరికతఅనాగరికతఅవుతుందనినాఅభిప్రాయము

★ డియర్ కొలంబస్! అతి ఎప్పుడూ అనాగరికమని తెలియదా?!

**జి. యు ఎస్ ఆర్. — బరంపురం.**

ఆదర్శ స్త్రీకి వుండవలసిన లక్షణాలు నేటి ఆంధ్ర వనితలకు అరుదై పోవుటకు కారణం?

★ అసలు ఆదర్శ స్త్రీ లక్షణాలు ఏమిటో తేల్చండి ముందు. ఆ ఆదర్శం ఏ కాలానిదై వుండాలో తేల్చండి. అప్పుడు కదా అవి అరుదై పోతున్నదీ లేనిదీ చెప్పడం సాధ్యం అవుతుంది.

**ఎస్ ఆర్; ఎస్ వి ఎస్ ఎన్. ఆర్. — బరంపురం.**

చిత్రసీమలో జ్యోతిలక్ష్మి జయమాలిని గార్లపై మీ అభిప్రాయం ఏమిటి? వాళ్ళు నటించే తీరు — ఇదేనా హిందూ స్త్రీలయొక్క...

★ మీ పిచ్చిగాని సినిమాలో నటనచూసి హిందూ స్త్రీ ధర్మాలు వల్లెవేస్తే ఎలాగ? అసలు మన సినిమాలు ఏ ధర్మాలని అనుసరించి — సాగుతున్నాయి — ఆ సంగతి ఆలోచించండి ముందు!

**వి. ఎస్. కె. — విజయవాడ**

ఒక ఆడది, ఒక మగవాడు కలిసిమాట్లాడితేచే ఈ సంఘానికి అనుమానం ఎందుకు?

★ సంఘానికెందుకు అనుమానం? ఆ అనుమానమేదో మీ మనసులో వుంటే తప్ప దాన్ని గురించి ఆలోచించనే ఆలోచించరు. "ఎవరేనా ఏమేనా అనుకుంటున్నారా? అనుకుంటారేమో" అన్న అనుమానంతో ఎందుకుండాలి? మీ మనసులో కల్మషం లేనప్పుడు ఎవరేం అనుకుంటేనేం?!



సీరియల్

# మోహనరూప

మాదిరెడ్డి సులోచన

**( గత సంచిక తరువాయి )**

**ఫ**లాహారపు విందు ప్రారంభం అయింది. ఇంద్రమోహన్ బొంగరంలా తిరుగుతున్నాడు ప్రతివారు అతడిని పిలువటం ఏదో అడగటం, అతను అందరికి జవాబులు చెబుతున్నాడు అరగంట గడిచింది. విశ్వం ఎక్కడా కనిపించలేదు. ఆదుర్దాగా చుట్టూ కలయచూచాడు. ఎక్కడా లేదు. వెళ్ళి రూపాదేవిని అడిగాడు

"నాకేం తెలియదు..." అని తల్లితో కబుర్లలో పడిపోయింది. ఆమె నిర్లక్ష్యపు ధోరణికి అతనికి విసుగు కల్గింది. తన గదికయితే వెళ్ళలేదుకదా! గది వైపు వెళ్ళబోయాడు.

"ఇంద్రయ్యా!" తాతయ్య పిలిచాడు

"ఏం తాతయ్యా?" కంగారు కప్పిపుచ్చుకుని అడిగాడు.

"ఇప్పుదియ్య! జహంగ్రీలు భలే కుదిరాయి ప్లేట్లలో పెట్టివేవేనా, లేక అడిగితే ఒకొకటి వేస్తారా?"

"మీండిగితే వెయ్యకుండా వుంటా మా తాతయ్యా..." బుట్ట పట్టుకొచ్చాడు.

"ఏమయ్యో! నా కనుకు నేవు! వీళ్ళు అడుగుతున్నారు." ప్రక్కవారిని చూపాడు.

"ఊఁ." ఇంద్రమోహన్ నవ్వి ప్రక్కవారికే వడ్డించి, పోబోయాడు.

"ఒరేయ్..ఒరేయ్! గడుసుపిండానివిరా..." అని పక్కున నవ్వి, రెండు జహంగ్రీలు తన ప్లేటులో వేసుకున్నాడ.

"ఆఁ అలా రండి దారికి..."

"రుచిగా వున్నాయి, అందరికి కావాలేమో అడుగు" అన్నాడు. ఇంద్రమోహన్ నవ్వుకున్నాడు. ఎంతయినా ఆ కాలంవారు భోజన ప్రియులు. ఇప్పుడు తిండిమీద ధ్యాసలేదు ఏం తింటే లావెక్కిపోతామోనన్న భయం. ఆనాడు లావు సమస్య లేదా అనుకుంటే తిన్నదానికి రెట్టింపు పని వుండేది. నడక వుండేది. అందుకే తిండిదగ్గర అంత మొహమాటపడవలసివస్తుంది బుట్ట బల్లమీద పెట్టి గదివైపు బయలుదేరాడు.

"ఇంద్రమోహన్! పవర్ హౌస్ స్టాఫ్ వచ్చినట్టున్నారు చూడు." శ్రీహరి పిలిచాడు.

"ఊఁ! ఈ ఒక్కరోజు చేస్తే మాట రాదు." అనుకున్నాడు.

వాళ్ళందరిని కూర్చోబెట్టి, ఖాళీ అయిన

"ఏవండోయ్ మేనేజరుగారూ! క్లినిక్‌లో, తన గదిలో వున్న వస్తువుల అంపకం పెడతాడట శోభన్‌గారు! నేను వెడుతున్నాను. గెస్ట్‌ల సంగతి మీరే చూచుకోవాలి." రూపాదేవి ఆజ్ఞాపించింది. ఆమె ముఖం కాంతివంతంగా వున్నాయి కళ్ళు మెరుస్తున్నాయి. ఎప్పటికంటే హుషారుగా వుంది. ఎంతయినా తల్లి, తండ్రులు వస్తున్నారంటే హుషారుగా వుండదామరి అనుకున్నాడు.

"మోహన్! నాన్నను, రుక్కును వదిలి అరగంటలో వచ్చేస్తాను." శ్రీహరి కారు తీసుకుని వెళ్ళిపోయాడు.

"అబ్బ ఖైదుచేసి వెళ్ళారు! ఈ విస్సిగాడు ఎక్కడికి వెళ్ళాడో! రూపాదేవికి అంత నిర్లక్ష్యం తగదు" అనుకున్నాడు.

అందరు వెళ్ళేసరికి రాత్రి తొమ్మిది దాటింది స్టాఫ్ సామాన్లు సర్దుతున్నారు. రూపాదేవి గొంతు గట్టిగా వినిపించేసరికి ఇంద్రమోహన్ అటు వెళ్ళాడు. శోభన్ ఎఱ్ఱబడిన ముఖంతో ఎదురువచ్చాడు

"ఏమిటి శోభన్! ఏం జరిగింది?"

"హత్య జరిగేది కాని వదిలివేశాను. సంస్కార హీనుడు. చవట..." అతని నోటెగుండా అలాంటి మాటలు వినటం యిదే ప్రథమము అగ్రిమణిలా వుంది అతని ముఖం

"ఎవరు శోభన్!"

"అదే నీ ఫ్రెండు విశ్వం! ఛ...ఛ. ఒక్క స్త్రీతో నవ్వినంతమాత్రాన అలా అంటారా! ఆమె నాకు అక్కవరస తెలుసా!" మండిపడ్డాడు.

ఇంద్రమోహన్ అతని భుజంమీద చెయ్యివేసి అనునయంగా అసలు విషయం చెప్పమని అడిగాడు

"ఆమెకు చార్జ్ యిద్దామని పిలిచాను అక్కడ వున్న డ్రగ్స్ లెక్కచూచుకొమ్మన్నాను కాంపౌండరు కాస్త చేతివాటం వున్నవాడు."

"అవును అది గమనించాను" అన్నాడు ఇంద్రమోహన్.

"అదే నేను చెబితే ఆవిడ దొంగ చేతికే తాళాలు యిస్తే అన్నారు. ఆ సిద్ధాంతం ఇప్పుడు వర్తించదు. వాడు తాళంతోసహా చెక్కేస్తాడు అన్నాను. ఇద్దరం నవ్వాం. పెద్ద పోజుపెట్టుకుని వచ్చాడు విశ్వం. 'ఎన్నాళ్ళనుండీ నాటకం?' అని పిచ్చి, పిచ్చిగా వాగుతున్నాడు."

"వాడికి మతి పోయింది" ఇంద్రమోహన్ ఆదుర్దాగా లోపలికి వెళ్ళాడు.

"డబ్బు వుండవచ్చు. కాస్త ఒళ్ళు దగ్గిర పెట్టుకుని ప్రవర్తించమను..." హెచ్చరించాడు శోభన్. అతను నాగుపాములా బుసలు కొడుతున్నాడు.

***జరిగిన కథ - 8*** స్నేహితులు విశ్వం, ఇంద్రమోహన్, పాషా, స్వామ్సన్, - చక్రిలు విహార యాత్ర ముగించుకొని హైదరాబాద్ చేరినపుడు ఇంద్రమోహన్ ఐ డి. పి. ఎల్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళగా; మిగిలిన స్నేహితులు, అక్క సుగుణ, బావంతో కలిసి ఒక సంబంధం చూస్తాడు విశ్వం. ఆమె శ్రీహరి, రుక్మిణిల ఏకైక కుమార్తె డాక్టర్ రూప. ఆమె ఆహ్వానంమీద ధనికుడైన విశ్వం బీదవాడైన ఇంద్రమోహన్‌తో నర్సింగ్‌హోమ్ చూడటానికి సాగర్ వెళ్తాడు కానుకలన్నా కోరలేదన్న కారణంగా తనకు, తన చెల్లెలు పూర్ణకు కుండమార్పిడి సంబంధం విఫలమవడం, ఉద్యోగ ప్రయత్నంలో మోసగింపబడడంవల్ల ఇంద్రమోహన్ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు. రూప తండ్రి విదేశాలకు వెళ్ళిన సమయంలో ఇంటి వ్యవహారాలు చూసే ఉద్యోగం చేస్తూ ఆమె నడవడి కనిపెట్టటానికి ఇంద్రమోహన్‌ను పంపుతాడు విశ్వం. రూప దూరపు బంధువైన శోభన్, ఇంద్రమోహన్‌లతో చనువుగా ఉండటాన్ని క్లినిక్ ప్రారంభోత్సవానికి వచ్చిన విశ్వం గమనిస్తాడు దురలవాట్లకు లోనయిన విశ్వం ప్రవర్తనను గురించి రూప, ఇంద్రమోహన్‌ని ప్రశ్నిస్తుంది. ఇంద్రమోహన్‌కు తప్పిపోయిన సంబంధం తాలూకు అమ్మాయి, సావిత్రి, అబార్షన్ చేయించుకొనే నిమిత్తమై రూప నర్సింగ్‌హోమ్‌లో చేరుతుంది రూప, ఇంద్రమోహన్‌లు మరింత సన్నిహితు లవుతారు.





ఇంద్రమోహన్ గదిలోని దృశ్యం చూచి నోట మాట రానట్టు నిలబడిపోయాడు. ప్రత్యర్థుల్లా, ఒకరి నొకరు తీక్షణంగా చూచుకుంటూ, రూపాదేవి, విశ్వం గదిలో నిలబడ్డారు. ఇద్దరిమధ్య అడ్డుగోడ కడతానన్నట్టు డైరీ రెప, రెపలాడుతుంది. దాన్ని చూస్తే ఎవరో నేలకేసి కొట్టినట్టుంది. ఆ డైరీని చూడగానే ఇంద్రమోహన్ ముఖం పాలిపోయింది. ముఖంలో రక్తం లేనట్టు అయింది. అతని కాళ్లలో సన్నగా వణుకు ప్రారంభం అయింది.

"మిష్టర్ ఇంద్రమోహన్! హాయిగా సినిమాలోకి వెళ్లకపోయారా! నటుడిగా రాణించేవారు!" అసహ్యము, వెటకారం మేళవించిన కంఠంతో అన్నది.

"రూప ... రూపగారూ !"

"నా పేరు రూపాదేవి. ఏం మగవాళ్ళు! యూనివర్సిటి డిగ్రీలు పొందారు. కాపీకొట్టి వుంటారు. విద్యాధికురాలయిన అమ్మాయి పెళ్లి చేసుకుంటానంటే ఒకరికి అనుమానంవస్తే మరొకరు ఆ అమ్మాయి గుణగణాలు పరిశీలిస్తారు. భేష్! భారత యువకులకు మీరు చూపిన బంగారు బాట .."

"మాటలు మీరొద్దు. నీ అసలు సంగతి బయటపడింది." విశ్వం అరిచాడు కోపంగా.

"నోరు ముయ్యి. ఆ మాట నేను అనాలి." ఆమె ముఖం చూస్తే కోపంతో ఎర్రబడిందని పించింది.

"మా విషయాలు బయటపడినా అభ్యంతరం లేదు. మేం మగవాళ్లము..."

"మీ మగతనం ఊరేగించుకుని, సన్మానాలు చేయించండి. తక్షణం ఇక్కడనుండి దయచెయ్యండి."

"మేం గర్వంగానే వెడతాం. నీ గతి ఏమవుతుందో ఆలోచించు. అసలు మెడిసిన్ చదివినవాళ్లకు కారెక్టర్ వుంటుందనుకోవటం నా..." అంతే అతని చంపలదిరిపోయాయి.

"వాచ్‌మెన్ ... వాచ్‌మెన్..." ఆమె ఆడపులిలా గర్జించింది.

ఇంద్రమోహన్ విశ్వాన్ని బలవంతంగా బయటికి ఈడ్చుకుపోయాడు.

అప్పటికే వందనతోసహా రూపాదేవి గదిలోకి వెళ్లటం చూచాడు. ఆ క్షణంలో భూమి బద్దలయి తను అందులో ఇమిడిపోతే బాగుండును అనిపించింది. అసహ్యంతో చూచే రూపాదేవి కళ్లముందు కదిలింది. అతని హృదయం కుంచించుకుపోయింది.

"ఒరేయ్! దాన్ని బజారు కీడుస్తాను... బతుకు బండలు చేస్తాను." గింజుకున్నాడు విశ్వం.

"మిగిలిన దెబ్బలు ఏమయినావుంటే నేను వేయాల్సి వుంటుంది. ముందు నువ్వు బస్సెక్కు. నీవు నోరు పారేసుకుని ప్రచారం చేయగానే నమ్మటానికి, ఇదేం సినిమా కాదు. ఇక్కడివాళ్ల కామె దేవత తెలుసా !"

"ఒహో చాలా సమర్థిస్తున్నావ్! ఆమె ప్రియులలో నువ్వూ వున్నావా ?"

"విశ్వం! నోరు అదుపులో పెట్టుకో. నువ్వు ఇక్కడ వుండటం ఎవరికి మంచిదికాదు..." బలవంతంగా అతన్ని బస్ స్టాండుకు పంపి నుదుట పట్టిన చెమట తుడుచుకున్నాడు. అతను ఆత్మగ్లానితో కుంచించుకుపోయాడు. రూపాదేవికి ఎలా ముఖం చూపాలి! ఇంత చక్కగా జరిగిన పార్టీలో యిదేం అపశృతి!

"ఏమయ్యా ఇంద్రయ్యా! నీ కిదేం బుద్ధి! అన్నీ వదిలేశాం. ఇంటివాడికన్నా ఎక్కువగా చూచాము. మందులు, వస్తువులు దొంగతనంగా విశ్వానికి అందిస్తున్నావా!"

తాతయ్య అడిగాడు. అతను కోపంగాలేడు. తన అంచనాలు తప్పిపొయ్యాయన్న బాధతో గిల, గిలలాడుతున్నాడు.

"తాతయ్యా..." నేను దొంగతనం చేశానా అని అడుగబోయాడు. వెంటనే ఆమె ఇబ్బంది అర్థంచేసుకున్నాడు. ఏ యువతి అయినా, తనను, తన గుణ, గణాలు పరిశీలించటంకోసం ఒక వ్యక్తిని నియమించారని యెలా చెబుతుంది. తాము సిగ్గుమాలిన పని చేసినా, మరో విధంగా సమర్థించుకుంది. ఆ డైరీ చదివినవారెవరయినా చేసే పని అదే. తనను ఎక్కడ దెబ్బ కొట్టాలో అక్కడే కొట్టింది.

"ఎందుకు చేశావు ఇంద్రయ్యా ?"

"డబ్బుకోసం..." అన్నాడు గొంతు పెగల్చుకుని.

"నీ చేతిలోనే బోలెడు డబ్బుంది కదయ్యా."

"దానికి లెక్క చెప్పాలి..." అన్నాడు తల వంచుకుని

"ఎంత పని చేశావయ్యా! విశ్వానికి వాగ్దత్త కాకపోతే మా రూపను ఇచ్చి చేద్దాం అనుకున్నాను కదయ్యా."

"మన్నించండి తాతయ్యా" అని మాత్రం అనగలిగేడు. ఎక్కడో పొరపాటు జరిగివుంటుందని, ఇంద్రమోహన్‌తో మాట్లాడి మనమరాలిని కేకలువేద్దాం అనుకున్నాడు. అతనే స్వయంగా అంగీకరించాక ఏమనగలడు! ఇంద్రమోహన్ రాయిలా అలాగే నిలబడిపోయాడు.

## 17

పేషెంట్లంతా వెళ్లిపోయారు. నీరసంగా వెనక్కి వాలిపోయింది రూపాదేవి. విశ్వం అడిగి:

దాసికి, శోభన్‌కు తనకు రంకు అంటగట్టినా ఆమెకు బాధ కలుగలేదు ఇంద్ర మోహన్ వెన్నుపోటుకే ఆమె తట్టుకోలేకపోయింది. ఆమెకు తెలియకుండానే ఆమె చేతులు డ్రాయర్ లాగి డైరీని తీశాయి. పేజీలు తిప్పింది ఈరోజు, ఆరోజు అని లేకుండా పేజీలు నింపాడు.

''ఈరోజు రూపాదేవి చాలా అందంగా తయారయి వచ్చింది. ఏమిటబ్బా అనుకున్నాను, ముసలి పేషంటుతో సరసాలు ఆడటం చూచి చేతనయితే ఆకాశం ఆమె నెత్తిన కూల్చాలి అనుకున్నాను. వీలుకాలేదు.''

''ఈరోజు తల నొప్పిగా వుంటే రెండు మాత్రలు తెచ్చుకుందామని వెళ్లాను. గదిలో నుండి శోభన్, రూపాదేవి నవ్వటం వినిపించి, నా గుండె జల్లుమంది. ప్రేమించుకుంటున్నారేమో! అదేంటబ్బా! గూట్లో గువ్వలా గుస, గుసలు!''

''అవ్వ అవ్వ! చదువుకున్నదానను అన్న ఆత్మవిశ్వాసం కాబోలు! ఎవరా సుందరుడు అతని నడుముచుట్టూ చేయి వేసింది ఇది భారతదేశం అని తెలియదేమో! భారత పురుషుడు తనెంత తిరిగినా స్త్రీ పవిత్రంగా వుండాలనుకుంటున్నాడు. పాపం విశ్వం.''

''అతనెవరో రోజూ వస్తున్నాడు! ఓరోజు గుండె నొప్పిట, ఓరోజు కడుపు నొప్పిట. ఇంకానయం, ఒళ్ళంతా నొప్పులనలేదు. రూపాదేవి విసుగు, విరామము లేకుండా ఆర్ద్రంగా, ఆప్యాయంగా చూస్తుంది అతడిని. ఆవిడ ప్రేమిస్తుందేమో! విశ్వం మాటో! ఆ... పెళ్లి అయినవారే పరాయివారితో తిరగ్గలేనిది, ప్చ్ ఇదో లెక్కా...''

''విశ్వం! నీ అనుమానాలు నిజమయ్యాయిరా. ప్రతీ పేషెంటును ఎంత శ్రద్ధగా చూస్తుందో! మగ పేషెంట్లు అంటే మరీ కులుకులు, గులుకులు! అబ్బ అది చూస్తుంటే నాకే యెట్లాగో వుంది. మరి చేసుకోబోయేవాడికి ఎలా వుంటుంది! పాపం...''

పళ్లు పట, పట కొరికింది రూప. ఆమె విసురుగా మరికొన్ని పేజీలు తిప్పింది. అంతటా అలాగే వ్రాశాడు. డేట్లు వేశాడు. ఆమెకు ఆనాటి తారీఖు చూచి అదిరిపోయింది రాత్రంతా రోగితో హోరా, హోరి పోట్లాడినంత పని అయింది. కేకలు, బొబ్బలు గోల, అతడి నుండి తప్పించుకుని నిదుర ఇంజక్షన్ యివ్వటానికి యెంత ప్రయత్నం చెయ్యాలో అంత చేసింది దానికి ఇంద్రమోహన్ సహకరించాడు కూడాను

''ఆ రాత్రి ఊహించలేము. రోగి చాలా బాధపడుతుంటే లేపుదామని వెళ్లాను. హాయిగా డాన్స్, ట్విస్ట్, షేక్ చేస్తూ నైట్ గౌన్లో వుంది. మందలించాలని అనుకుంటే అసలు తను నాకా అవకాశమే యివ్వలేదు. అతను బయటికి వచ్చి 'డార్లింగ్ కండిషన్‌లో లేదు, వెళ్లవయ్యా' అన్నాడు. ఎంత దారుణం!''

''నిజంగానే దారుణం నిన్ను క్షమించ కూడదు'' అని బల్లమీద గుద్దింది. ఆమె రక్తం సల, సల కాగిపోతుంది అతని అమాయకత వెనుక ఇంత విషం ఉందా!

పేజీ తిప్పింది. అక్కడే ఆమె దృష్టి అతుక్కుపోయింది ఆ రోజు తనకు బాగా తెలుసు వెనుక స్టాఫ్ రూమ్స్ రూఫ్ వేస్తున్నారు. కూలీలకు స్వయంగా టీ చేసి ఇచ్చాడు ఇంద్ర మోహన్ పదకొండు గంటల వరకు అక్కడే ఉన్నారు. రాత్రి అయిందని పంపించివేశాడు.ఆ రోజు కార్యక్రమం యెంత దారుణంగా వర్ణించాడు!

''మధ్యాహ్నమునుండి ఆస్పత్రిలో, ఇంట్లో డాక్టరమ్మ జాడే కనిపించలేదు యెవరో వచ్చి తీసుకువెళ్లారు అని చెప్పారు డాక్టరమ్మగారి కోసం అందమైన పేషెంట్లు వస్తారు వారితో వెళ్లిందేమో అనుకుని, సాయంత్రం అలా బయటికి వెళ్లాను. హిల్ కాలనీ దాటివచ్చేసరికి చుట్టూ గుట్టలు చెట్లు ఉన్నాయి మరోవైపు డామ్, ఇవతలివైపు జారుడుగా ఉంది పచ్చగడ్డి చెక్కి అందంగా ఉంది దానిపై డ్యూయెట్లు పాడు తున్నారు, డ్యూయెట్లు ఏం డాక్టరమ్మ డాక్టరువే యాక్టర్లా చేస్తున్నావేం అని అడుగుదాం అనుకున్నాను ఆవిడ ఏం చేస్తే మనకేం? మనవాడు మగవాడు! వాడిని వేలెత్తి చూపే దమ్ములు యెవరికి! ఈ డాక్టరమ్మ కాకపోతే మరో యాక్టరమ్మ అది కాకపోతే మరో ఆడ గుమ్మ. కేరేహోంగ్ అన్నాను.''

రూప ఒక్క నిముషం ఆలోచనలో పడింది పేజీ తిరిగిపోయింది.

''ఛ ఛ.. యెంత డాక్టరయితే మాత్రం

## జ్ఞాపకాల రూపకాలు



— డాక్టర్ దాశరథి

జ్ఞాపకాల రూపకాలు !
ఒకటి చంపకం ! ఒకటి కంటకం !
ఒకటి సుఖాంతం ! ఒకటి దురంతం !
ఒకటి రేయెండ ! ఒకటి మండుటెండ !

ఈ జ్ఞాపకాల రూపకాలను
అజ్ఞాన మనో రంగస్థలంమీద చూస్తూ
పులకిస్తూ, ఉలిక్కిపడుతూ
పూటలు గడిపేస్తుంటాను

వద్దని ఎంత మనసు మార్చుకున్నా
వద్ద చేరి కవ్విస్తాయి జ్ఞాపకాలు;
గతాన్ని వదిలించుకోడం సులభం కాదంటాయి
మతిమరుపు మనిషి అదృష్టవంతుడంటాయి

కారాగృహంలో అడుగు పెట్టేముందు
కంట తడి పెట్టుకుంటూ వెంట వచ్చి,
మరలి వచ్చేదాకా నిరీక్షిస్తానని
మాట యిచ్చిన ముద్దరాలి ముఖం !

స్వతంత్రునిగా తిరిగి వచ్చిననాడు
బలాత్కృతయై, పరతంత్రయై
ముఖం చూపడానికి వెనగాడే రూపం
మూడు దశాబ్దాలైనా వెన్నాడుతుంది, పాపం !

తాగి, దేవుడికి టెలిఫోన్ చేసే
వాగుబోతుతానే సవాళ్ళు వేస్తాడు
తానే దేవుడి తరపున జవాబులు చెబుతాడు;
అలాగే నా జ్ఞాపకాలకు నేనే రూపకాలు
అల్లుకుంటున్నాను

భారత స్త్రీ కదా! ఆ చేసేవి చాటుమాటుగా చెయ్యరాదు. పదేళ్ల పిల్లాడయినా పరాయి మగాడే కదా కాలు నొప్పి అని వాడంటే ఈవిడ బాధ పడింది. భారత స్త్రీ సంతోషం, విచారం, బాధా అన్నీ భర్తతోనే ఛీ... బొత్తిగా బరితెగించిన వాపతు. అందుకే నేను డాక్టర్లను చేసుకోను అణగి, మణగి ఉండే అప్పలమ్మను చేసుకుంటాను.''

''అది నెత్తిన నాల్గు సరిగ్గా మొదుతుంది. ఈడియట్!'' కసిగా డైరీ నేలకేసి కొట్టింది

''డాక్టరుగారూ!''

తలెత్తి చూచింది. ఆమె హృదయం భగ్గు మన్నది. ముందున్న ట్రే తీసుకుని అతని ముఖాని కేసి కొట్టాలనుకుంది మెడపట్టి గెంటాలను ంది. అందమయిన ఆ చెంపలపై కత్తితో గాట్లు చెయ్యాలనిపించింది.

''డాక్టరుగారూ! ఏం చేస్తే మీ కోపం పోతుందో చెప్పండి...' నీరసంగా నవ్వుతూ, అడిగాడు ఇంద్రమోహన్.

''అదిగో, ఆ యెదురుగా కనిపించే బండ తీసి మీ నెత్తికేసి కొడితే కూడా కోపం పోదు'' అన్నది పదునుగా, కొర కొర చూస్తూ.

''కొట్టండి, ఆలోచన దేనికి?'' నిశ్చలంగా నిలబడ్డాడు.

''ఛీ... మీలాంటివారిని కొట్టినా నా చేతులు మలినమయిపోతాయి. ముందు నా కళ్లముందు నుండి వెళ్లిపొండి'' అన్నది లేచి లోపలి గదిలోకి వెడుతూ ఆమె చూపులు గమనిస్తే అతని ముఖం చూడటం కూడా ఇష్టం లేనట్టుంది.

''వెళ్లబోయేముందు మీతో ఒక్క నిజం చెప్పిపోదామని వచ్చానండీ...''

''ఛట్! నిజం... ఆ పదానికి అర్థం తెలుసా? అబద్ధాలు ఆడగల నువ్వు నిజం అంటుంటే ఆశ్చర్యంగా. అబద్ధాలంటే మామూలు అబద్ధాలా? చెప్ప... ఇక్కడ ఆస్పత్రి కట్టిస్తూ నా జీవితాన్ని నువ్వు చూచినంత క్షుణ్ణంగా మరెవరూ చూడలేదు. పేషెంట్లతో కులికానా!''

''మీరు నాకు కొంత సమయమిస్తే, సావకాశంగా అన్నీ చెబుతాను'' అన్నాడు రెండడుగులు ముందుకు వేసి.

''అక్కడే ఆగు! నువ్వు చెప్పింది వినదలుచుకోలేదు. ఇంకొక్క నిముషం నీతో మాట్లాడను.

## మోహన రూప

వెళ్లిపో, మళ్లీ యెప్పుడూ నాకు కనిపించకు.''

''నిజం తెలుసుకుని, మంచి, చెడు అర్థం చేసుకునే సమయము ఒకనాడు వస్తుంది, తప్పక వస్తుంది'' అతను వెనుతిరిగి రెండు అడుగులు వేశాడు. మళ్లీ ఏదో గుర్తుకు వచ్చినట్టు, రూపాదేవి వైపు తిరిగాడు.

''మీరు ఆ డైరీ మొత్తం చదవండి...''

''ఒహో! ఇంకా అభాండాలున్నాయన్నమాట చదివి తనివితీరా ఏడిస్తేగాని మీకు తృప్తిగా వుండదేమో. కాని ... మీ రూహించినట్టు నేను పిచ్చిదాన్నికాను బాధపడను...''

''బాధపడుతూనే, బాధపడను అంటే ఎలా నమ్మతాను!'' నవ్వడానికి ప్రయత్నించాడు.

''నన్ను అన్నారని కాదు బాధ! విద్యావంతులే యింతగా దిగజారిపోతే విద్యకు అర్థంలేదని బాధపడుతున్నాను ... ప్లీజ్ వెళ్లిపొండి. ఇదో అనుభవం, ఖరీదయిన అనుభవం.'' కన్నీరు బలవంతంగా బిగపట్టటానికి అన్నట్టు పెదవులు నొక్కిపట్టింది.

''నేనిక్కడ వున్న రోజులలో మీరు చూపిన ఆదరాభిమానాలకు ధన్యవాదాలు'' అన్నాడు చేతులు జోడించి.

''మా నౌకర్లనంతా అభిమానంగానే చూస్తాం. మీకు ప్రత్యేకత ఏం చూపలేదు'' అన్నది నిర్లక్ష్యంగా.

''మీరు తాతయ్యతో దొంగ అన్నారట. నిజంగానే దొంగను. నేను దొంగిలించుకుపోతున్న అపురూపమైన వస్తువు వెలకట్టలేనిది... వస్తాను.''

మెరుపులా, ఆమెకు ఆలోచించటానికికూడా వ్యవధిలేనంత వేగంగా ముందుకు వచ్చి, ఆమె రెండు చేతులు కళ్లకు అద్దుకున్నాడు. ఆమె తేరుకునేలోపలే అతను వెళ్ళిపోయాడు. ఆమె చేతులపై తడి మాత్రం మిగిలిపోయింది. మెల్లగా అడుగులువేస్తూ, కిటికీ దగ్గరకు వచ్చింది. ఒక మనిషి పెట్టె, బెడ్డింగ్ ఎత్తుకుని నడుస్తున్నాడు. వెనుక బ్యాగు పట్టుకుని ఇంద్రమోహన్ బయలుదేరాడు. ఆకుపచ్చ చారలున్న ప్యాంటు, తెల్ల షర్ట్‌లో మరింత ఆకర్షణీయంగా కనిపించాడు. గేటు దగ్గర ఆగి వాచ్‌మెన్‌కు పదిరూపాయలు యిచ్చాడు. అతను ఏడ్చినట్టు ముఖంపెట్టి, ఏదో అనటం భుజం తట్టి ఓదార్చటం కనిపించింది

''నర్స్..'' రూప ఘర్జించినట్టే పిలిచింది

''ఎస్ మాడమ్.'' నర్స్ వచ్చింది

''ఆ వాచ్‌మెన్‌ను ఇక్కడకు రమ్మను...''

అయిదు నిమిషాల్లో వాచ్‌మెన్ అక్కడికి వచ్చాడు

''తిండి యెక్కువయిందా?''

అతను తెల్లబోయాడు. అసలు యజమానురాలితో మాట్లాడటమే చాలా తక్కువ! ఈ స్థాయితో మాట్లాడటం ఇదే మొదటిసారి

''ఉద్యోగం చెయ్యాలని ఉందా?''

''అమ్మా!'' చేతులు నులుపుకున్నాడు

''ఒక నౌకరిగాడి దగ్గర డబ్బు తీసుకుంటావా?'' అరిచినట్టే అడిగింది

''అయ్య ఇస్తే...'' నసిగాడు తల్లీ అతనిపై అంత పెద్ద నింద మోపావు. ఏ క్షణంలో ఏం చేస్తావో అన్నట్టు చూచాడు ఆమె ముఖం తిప్పుకుంది.

''అయ్యట... అయ్య...'' పళ్ళు కొరికింది. అతను వెళ్లిపోయాడు. నర్స్ అయోమయంగా చూచింది. క్రింద పడిన డైరీ జాగ్రత్తగా డ్రాయర్లో పెట్టింది

''మేడమ్! ఇంద్రమోహన్‌గారు దొంగతనం చేస్తున్నట్టు యెవరయినా చెప్పారా, మీరు స్వయంగా చూచారా!'' అని అతిమెల్లగా అడిగింది.

''ఏం? యెందుకు?'' అతి తీక్షణంగా అడిగింది.

''యెవరయినా అసూయతో చెప్పారేమోనని... ఆయన అలాంటివారు కారు...''

''నేనే చెడ్డదాన్నా!''

''అబ్బే అలా అనలేదు. ఏదయినా పొరపాటు జరిగిందేమోనని'' నసిగి వెళ్లిపోయింది.

''ఉహుం! పదునయిన కత్తి! అందరి గుండెలో అభిమానం సంపాదించాడు...'' అనుకుంది పెదవి నొక్కిపట్టి. అందరు వెళ్లిపోయాక చాలాసేపు బల్లమీద తల వాల్చి కూర్చుంది.

''మీకు టీ చేసి ఇవ్వటంలో ఆనందం ఉందండీ...''

''అబ్బే! వేరే మందు లెందుకు మీ చిరునవ్వులు చాలు రోగాలు నయం చెయ్యటానికి!''

''ముఖస్తుతి అనుకోకపోతే ఓ మాట

# పెరుగుతున్న సంవత్సరాలు కాల్షియం-శాండోజ్® సంవత్సరాలు










పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి విటమిన్ సి, డి మరియు బి[12]తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్లల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది

కాల్షియం-శాండోజ్
స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్
వారు రూపొందించినది,
ప్రపంచంలోని
అత్యుత్తమమైన కాల్షియం.

## కాల్షియం-శాండోజ్®

### గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం





# భారత ఉపగ్రహాన్ని అమెరికా స్పేస్ షటిల్‌మీద నుంచి ప్రయోగించటానికి ఒప్పందం



అమెరికా వ్యోమ వాహనం స్పేస్ షటిల్ భారతీయ ఉపగ్రహాన్ని భూప్రదక్షిణ కక్ష్యలోకి ప్రయోగిస్తుంది భారత – అమెరికాల మధ్య ఇందుకు సంబంధించిన ఒడంబడిక జూలై 18న వాషింగ్టన్‌లో జరిగింది ఈ ఒప్పందంపై భారత ప్రభుత్వ వ్యోమ విషయాల విభాగం కార్యదర్శి, స్పేస్ కమిషన్ ఛైర్మన్ అగు ప్రొఫెసర్ సతీష్ ధవాన్, అమెరికా వ్యోమ పరిశోధన సంస్థ (నాసా) అడ్మినిస్ట్రేటర్ డాక్టర్ రాబర్ట్ ఏ ఫ్రాష్ చేవ్రాళ్లు చేశారు ఆ విధంగా అమెరికా వ్యోమ షటిల్ కార్యక్రమంలో ఇండియా తొలి ఖాతాదారుగా నమోదు అయింది. 1981 తొలి మూడు మాసాలలో భూప్రదక్షిణ కక్ష్యలోకి పంపనున్న అమెరికన్ షటిల్ వాహనం ఇండియన్ నేషనల్ శాటిలైట్ (ఇన్‌శాట్–1)ని అంతరిక్షం నుంచి ప్రయోగించటానికి ఈ ఒప్పందం జరిగింది ఈవిధంగా ఒక విదేశీ ఉపగ్రహాన్ని అమెరికన్ రాకపోకలు వ్యోమ వాహనం భూప్రదక్షిణ కక్ష్యలోకి ప్రయోగించటానికి జరిగిన తొలి ఒడంబడిక ఇది.

ఈ ఒడంబడిక ఫలితంగా ఇండియాకు ముఖ్యమైన కమ్యూనికేషన్ అవసరాలు తీరగలవు. అంతేకాకుండా అమెరికా తలపెట్టిన బ్రహ్మాండమైన అంతరిక్ష రాకపోకల కార్యక్రమానికి కూడా ఈ ఒప్పందం ఉపయోగపడుతుంది ఇది ఉభయ దేశాలకూ శాస్త్రీయంగా, ఆర్థికంగా లాభదాయకం కాగలదు ఈ ఒప్పందంలో భారతీయ ఉపగ్రహాన్ని ప్రయోగించటానికి, ఈ ఇన్‌శాట్ ఉపగ్రహం విజయవంతంగా పని చేయటానికి కావలసిన ఇతర సదుపాయాలు సమకూర్చటానికి సంబంధించిన అంశాలు, షరతులు వున్నాయి.

ఇన్‌శాట్ – 1 తొలి బహుళార్థ సాధక ఉపగ్రహం. దీన్ని నిశ్చల భూప్రదక్షిణ కక్ష్యలో ప్రవేశపెడతారు. అంటే భూపరిభ్రమణ వేగానికి సమానమైన వేగంతో భూమి పరిభ్రమించే దిక్కున ఇది ప్రదక్షిణలు చేస్తూ వుంటుంది. దీని ద్వారా ఖండాంతరాలకు టెలిఫోను సంభాషణలు కొనసాగించవచ్చు. ప్రపంచవ్యాప్తంగా టెలివిషన్ కార్యక్రమాలను ఈ ఉపగ్రహం ద్వారా రిలే చేయవచ్చు. ఇండియాలోని మారుమూల గ్రామాలలోని టెలివిషన్ సెట్లకు నేరుగా ఈ ఉపగ్రహం కార్యక్రమాలను రిలే చేస్తుంది. అంతేకాకుండా వాతావరణ సమాచారాన్ని కూడా ఉపగ్రహం నేరుగా అన్ని ప్రాంతాలకు రిలే చేస్తుంది. ఇన్‌శాట్ - 1 లో రెండు రిమోట్ సెన్సర్లు వుంటాయి. ఈ సాధనాల సహాయంతో మేఘాలు, తుఫానుల రాకడ గురించిన సమాచారాన్ని రోజంతా రిలే చేస్తుంది.

అమెరికన్ స్పేస్ షటిల్ నుంచి ఈ సదుపాయలను పొందటానికి భారత వ్యోమ సంస్థ నాసాకు ఇప్పటికే 8,00,000 రూపాయలు చెల్లించింది ఒక ఆసక్తికరమైన విశేష మేమిటంటే ఒక ఉపగ్రహాన్ని మామూలు రాకెట్ ద్వారా నేలమీద నుంచి ప్రయోగించటానికి ఇంతకంటే రెట్టింపు ఖర్చు అవుతుంది. ★

# మోహన రూప

చెబుతాను. మీ సౌజన్యం, సహనం చూస్తుంటే, అందరూ ముగ్ధులయిపోతారు. డాక్టర్లు ఇలా ఉండాలని అంటారు.''

''మా విశ్వం పట్ల నిజంగా అసూయ కలుగుతుంది.''

''అసూయతోనేనా ఇదంతా చేసింది!'' ఆమె మనసు మథనపడింది. ఒక్కరోజు ఆగితే, తన నిర్ణయము తెలిపేది తన సర్వస్వం సమర్పించుకుందాం అనుకున్నది అలాగే కూర్చుండిపోయింది

## 18

''హాయ్ బ్రదర్! మనవాడికి మహోపకారం చేశావ్...రా.'' చక్రం గ్లాసు పట్టుకుని ఎదురు వచ్చాడు ఇంద్రమోహన్ పురుగును చూచినట్టు చూచాడు.

''విశ్వం! తెలివిలో వున్నావా?'' గంభీరంగా అడిగాడు

''ఏమిట్రా నీ ఉద్దేశం! నేను.. తాగానన్నా!'' కోపంగా లేచాడు గోడ ఆసరాగా చేసుకుని లేచాడు

''త్రాగితే తప్పేముందిలే నాకిచ్చిన అప్పు తిరిగి యిద్దామని వచ్చాను'' అన్నాడు నోట్లు బల్లమీద పడేస్తూ

''ఆఁ... నిజంగా తెచ్చావా! ఎక్కడిదిరా ఈ డబ్బు?''

''నీలాగే మరో స్నేహితుడు, ఇంకో పని చెయ్యటాని కిచ్చాడు''

''ఛాన్స్ అంటే నీదేరా, ఇంకో అమ్మాయి దగ్గర కెడుతున్నావా!'' సంబరంగా అడిగాడు చక్రం. అతని కళ్లు ఎఱ్ఱగా వున్నాయి.

''ఒక్క అమ్మాయి కాదురా. వందమంది వున్నారు. విస్సీ! నీ స్నేహితుడిగా ఒక సలహా ఇస్తున్నానురా. మీ నాన్న సంపాదించిపెట్టాడని విచ్చలవిడిగా ఖర్చుపెడుతూ అర్థంలేని అనుమానాలతో తాడులేని బొంగరంలా చేసుకోకు జీవితాన్ని.''

''ఏమిటీ... తాడులేని బొంగరమా!'' పక్కున నవ్వాడు.

''ఏదిరా. నీ తాడేది?'' ఒళ్లంతా తడిమి చూచాడు చక్రం.

''వీడి తాడు రూపాదేవి దగ్గర వదిలేశాడు.''

''నోరు ముయ్యి! ఆవిడను ఒక్కమాట అనే అర్హత మనకు లేదు'' అన్నాడు డబ్బు విశ్వం ఒడిలో వేసి.

''ఒరేయ్... పెడ్డీలు కట్టనినాటి నుండి స్నేహం చేశాంరా బోడి రూపాదేవి ఎప్పుడు పరిచయం అయింది?''

''ముందు నోరు మూసుకుని లెక్క చూచుకో...'' అని అపహాస్యంగా చూచి వెనక్కు తిరిగాడు.

బుద్ధి వున్నవాడు, పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పించాలే తప్ప డబ్బు సంపాదించకూడదు ఆ డబ్బు సంపాదనే పిల్లలను పాడుచేస్తుంది. విశ్వం యెలా మారిపోయాడు ఆరోగ్యం ఎంతగా దెబ్బతిన్నది. త్రాగడం మూలాన బాగా ఒళ్ళు వచ్చింది. పెద్దవాడిలా కనిపిస్తున్నాడు ఎందుకు అలా ఒళ్ళుమరిచి త్రాగటమో అర్థంకాలేదు. గట్టిగా అంటే సంపాదించలేనివాళ్ళు, చేతకానివాళ్లు అలాగే అంటారనే అపప్రథ కూడా ఉంది.

ఇంద్రమోహన్‌కు మళ్లీ ఉద్యోగాన్వేషణ ప్రారంభం అయింది అదే పనిమీద ఒక మిషనరీకి వెడితే సామ్సన్ కనిపించాడు వీలయితే ఉద్యోగం చూస్తానుగాని తనకో సాయం చెయ్యమని కోరాడు కొన్ని ఆంగ్లంలో ఉన్న ఉపన్యాసాలు తెలుగులోకి అనువదించమని, కోరాడు అక్కడే రాత్రింబవళ్ళుండి ఆ పని పూర్తిచేశాడు ప్రతిఫలంగా రెండు వేల రూపాయలు ఇచ్చాడు

''ఒరేయ్! సామ్ నీ మేలు జన్మలో మరిచిపోనురా''

''మన మధ్య మేలు, కీడు ఏమిట్రా వెర్రివాడా! ఉద్యోగం ఇప్పించలేకపోయినా, సంవత్సరానికి అయిదారు వేల పని ఐమీన్ ట్రాన్స్‌లేషన్ వర్క్ ఇప్పిస్తాను''

''థాంక్స్‌రా...థాంక్స్...'' కళ్లనీళ్లపర్యంతం అయింది నేరుగా ఆ డబ్బు తెచ్చి స్నేహితుడికిచ్చాడు. తలపైనుండి పెద్ద భారం దించుకున్నట్టుంది. మరొక్కసారి మిస్ గంగను కలవాలి. అభిమానపడితే లాభం లేదు అవసరం తనది. మర్నాడు మళ్లీ ప్రయాణం అయ్యాడు.

''మళ్లీ ఎక్కడికిరా!'' జయమ్మ అడిగింది

''ఇంట్లోనే కూర్చుంటాను కడుపునిండా అన్నం పెట్టమ్మా'' అన్నాడు విసుగ్గా

''ఇంకా ఎన్నాళ్లో ఈ పని...'' ఆమె నొచ్చుకుంది.

/ఇంకా వుంది/

## వేటూరి కలంనించి ఉత్తమ సాహిత్యం 'రాధాకృష్ణ" వర్ణ చిత్రంలో

"నా పలుకే కీర్తనా—కదలికలే నర్తనా
సిరిపాలవెల్లి మా తెలుగు తల్లికి నేనే
రూప కల్పనా "నా పలుకే"
అలివేణి వాలుజడలో కృష్ణవేణి ప్రవహించగా
కలికి కడ కొంగులో వరద గోదావరి
పొంగగా—ఉప్పొంగగా
నా అడుగే హంసల దీవిగా
నా నడకే కిన్నెరసానిగా
తెలుగు మాగాణి పసిమితో జిలుగు చీర
జీరాడగా
నేనాడగా — పాడగా... ॥నా పలుకే॥
మువ్వగోపాల పదములా — నా మువ్వలే
ముద్దులాడగా
కొత్త ఋతువులో ఎంకిపాటలే కోయిలమ్మ
వినిపించగా
మనసులన్ని కావ్యాలుగా—సొగసులన్ని శిల్పాలుగా
వంపు సొంపులే హంపి కళలుగా — అందాల
అజంతాలుగా
నేనాడగా — పాడగా... ॥నా పలుకే॥
తెలుగువారి బంగారు కొండ మా ఏడుకొండల
వెంకన్న
కొలిచేవారిని కులవాడగని మా శ్రీశైల
మల్లన్నా
శబరి గౌతమి పొంగినచోట వెలసె
భద్రగిరి రామన్నా
కల్పవల్లి మా కన్నతల్లి కనకదుర్గమ్మ
కరుణజూడగా
నే నాడగా — పాడగా... ॥నా పలుకే॥

ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకత్వంలో సుశీల మధురంగా గానం చేసిన పై పాటను అన్నపూర్ణా కళానికేతన్ వారి కార్యాలయంలో టేప్‌నించి వింటూంటే "సిరము తప్త లోహ మున..." భర్తృహరి సుభాషితం గుర్తొచ్చింది. చక్కని సన్నివేశముంటే కవి ఎంతైనా ఇన్‌స్పైర్ అయి రాయగలడనడానికి పై గీతమే దృష్టాంతం. శోభన్‌బాబు, జయప్రద నాయకా నాయికలుగా కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో దుక్కిపాటి మధుసూదనరావు నిర్మించిన "రాధాకృష్ణ" వర్ణ చిత్రం చాలా కాలానికి ఒక చక్కని చిత్రాన్ని చూశామన్న సంపూర్ణ సంతృప్తిని ప్రేక్షకులకు కలిగిస్తుందనడంలో ఎలాంటి అత్యుక్తి లేదు.

### శ్రీరామరక్ష

వీరయ్య (అల్లు రామలింగయ్య) రెండు చంకల్లో రెండు సారా సీసాలు పెట్టుకొని, తూలుతూ లోనికి వచ్చి, "చక్రపాణీ! ఏయ్, చక్రపాణీ!" అని పిలిచాడు. చక్రపాణి (నాగభూషణం)తో పాటు శేషు (గిరిబాబు) కూడా గదిలోంచి వచ్చారు. "గుక్కెడు మందు పోయకుండా — గుక్కెడు మెతుకులు పెట్టకుండా చేసేశేవు కూతురు పెళ్ళి. నీకు సిగ్గు లేకపోతే నాకు లేదా? దా ... మందు పోస్తాను దా," అన్నాడు వీరయ్య.

"ఎంత పొగరురా నీకు? తప్పతాగి..." అంటూ కోపావేశంలో అగాడు చక్రపాణి.

"తప్పు, బాబూ, తప్పు. నేను తాగేనేగాని, తప్పతాగలేదు. కావాలంటే, పరీక్ష — డ్రింక్ పరీక్ష ... చూడండి. నాలుగు నల్లలారీలు, ఆరు ఎర్రలారీలు ... చూశా రా కరెక్ట్‌గా చెప్పాను. ఇంకా రెండు బుడ్డీలు తాగొచ్చు. కూకోండి. సరదాగా అందరం తాగుదాం," అన్నాడు వీరయ్య.

"ఏయ్, రా స్కౌండ్రల్!" అంటూ శేషు కొట్టేసరికి "బాబోయ్! చినబాబు చంపేస్తున్నారు. రచ్చించండి, బాబోయ్! కాపాడండి, బాబోయ్!" అని మొత్తుకున్నాడు వీరయ్య.

ఈ కేకలకు మేడమీద రాము, గోపి ఒక్కసారిగా లేచినిలుచున్నారు.

రాము, గోపిగా అక్కినేని ద్విపాత్రాభినయం నిర్వహించే అజయ్ ఆర్ట్ పిక్చర్స్ "శ్రీరామరక్ష" వర్ణ చిత్రం రీరికార్డింగ్ పూర్తిచేసుకొని, త్వరలోనే విడుదలకు సిద్ధమవుతోంది. వాణిశ్రీ, జయసుధ కథానాయికలు. జగ్గయ్య, పి. జె. శర్మ, కాకరాల ప్రభృతులు యితర పాత్రధారులు. 'మన సత్యం' నిర్మాత. తాతినేని చలపతిరావు సంగీత దర్శకుడు. సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు. ఈ చిత్రం అనంతరం తాతినేని రామారావు త్వరలో పి. ఎ. పి., శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్, విజయమాధవీ వారి కొత్త చిత్రాలకు దర్శకత్వం చేపట్టబోతున్నారు.



'జగన్మోహిని' లో ప్రభ



'పదహారేళ్ల వయస్సు'లో నిర్మల, శ్రీదేవి

## జి. వి. జి. పేజీ

### కోటిగాడు

వీనస్ మహీజా పిక్చర్స్ ఆఫీసు ముందు రంగురంగుల తోరణాలు కనిపించాయి అసలా తిరుమలపిళ్ళై వీధే చాలా సందడిగా వుంది నిర్మాత చెరుకూరి ప్రకాశరావు మందహాసంతో స్వాగత మివ్వగానే "ఏమిటండీ ఈ కోలాహలం ? కొత్త చిత్రం ప్రారంభిస్తున్నారా ?" అన్నాను. "కొత్త చిత్రం ప్రారంభించే విషయం మాత్రం నిజమేగాని, ఈ కోలాహలమంతా మాకు సంబంధించిందికాదు అటు చూడండి !" అంటూ ఎదుటి భవంతివైపు చూపించారు. అప్పటికిగాని నాకు బోధపడిందికాదు అసలు విషయమేమిటో ... ఆ మేడ స్వర్గీయ కామరాజు గారిది. ముప్పైఏళ్ళ పైబడి ఆయన అక్కడ వసించారు ఆ భవంతిని మూడులక్షల రూపాయలకు తమిళనాడు ప్రభుత్వం కొనుగోలు చేసి, ఆ మహనీయుని 76 వ జయంతి సందర్భంగా దానిని ఆయన స్మారక చిహ్నంగా జాతికి అంకితం చేసింది. "ఇప్పుడు అర్థమైందా— ఆకోలాహలానికి మాకూ ఏమీ సంబంధం లేదని ? ఇక నేను ప్రారంభించబోయే చిత్రం – కోటిగాడు," అన్నారు ప్రకాశరావు. "అలాగా ! ఐతే, ఆ సందడితో మీకు సంబంధంలేదని ఎందుకను కోవాలి ? కామరాజుగారు హరిజనోద్ధరణకు ఎంతో పాటుపడ్డారు మీరు తీసే 'కోటిగాడు' హరిజన సమస్యకు సంబంధించిందికదా ?" అన్నాను. ప్రకాశరావు నవ్వుతూ, "మా పిక్చర్‌కు వి. మధుసూదనరావుగారు డైరెక్టరండి. ఎస్. రాజేశ్వరరావుగారు సంగీత దర్శకులు," అని తెలియజేశారు. అంతకుముందే "కోటిగాడు" కథను రామలక్ష్మీ ఆరుద్ర నాకు వినిపించారు. కోనసీమ సహజ వాతావరణంలో సజీవమైన పాత్రలతో, వాస్తవిక సంఘటనలతో చాలా ఎక్కగా రూపొందించారు రచయిత్రి. ఆదాయమే కాక అవార్డులను కూడా దక్కించుకునే ఇతివృత్తం. "త్వరలోనే ఒక వార పత్రికలో ఈ నవల సీరియల్‌గా కూడా వెలువడుతుంది," అని తెలియజేశారామె వి. మధుసూదనరావు దర్శకత్వంలో ప్రకాశరావు కన్నడంలో నిర్మించిన "ఇద్దరూ ఇద్దరే" చిత్రం ఇటీవలే విడుదలైంది.

### నిసలైన రంగస్థలోపాసకుడు

తమిళ సినిమాలలో విలన్ వేషాలు వేస్తూ, రంగస్థలంమీద హీరో పాత్రలు ధరించే తమిళ నటుడు మనోహర్ "లంకేశ్వరన్, విశ్వామిత్ర, చాణక్య" వగైరా నాటకాలను విస్మయంగొలిపే ట్రిక్కులతో ప్రదర్శించి, బహుముఖ ప్రశంస లందుకున్నాడు. ఇతన్ని ఇతర నాటక సమాజాలవారు తమ నాటకాలకు ప్రధాన అతిథిగానో, అధ్యక్షత వహించమనో ఆహ్వానిస్తే, ఆ నాటకాలకు తనచేత టికెట్ కొనిపిస్తేగాని అంగీకరించడు.

ఈ సందర్భంలో ఒక విషయం గుర్తుకొస్తోంది. జార్జ్ బెర్నార్డ్‌షాకు, చర్చిల్‌కు అంతర్గతంగా ఒకరంటే ఒకరికి పడేదికాదుట – పైకి మిత్రుల్లా కనిపించినా. చర్చిల్ ప్రధాని గనుక తన కొత్త నాటకం తొలి ప్రదర్శన రోజున షా రెండు కాంప్లిమెంటరీ టిక్కెట్లు పంపిస్తూ, "ఒకటి మీకు ... మరొకటి మీకు స్నేహితులంటూ ఎవరైనా వుంటే వారికి," అని ఉత్తరం రాశాడు. చర్చిల్ వెంటనే సమాధానమిస్తూ, "మీ నాటకం తొలి ప్రదర్శనకు రాలేను. మలి ప్రదర్శన అంటూ ఏదైనా వుంటే రాగలను," అని విసురు విసిరాడట.

### పోటీ లేకుండా పోలికలు గల కథలు

హాలీవుడ్‌లో విధ్వంసకర చిత్రాలకు ఒరవడి పెట్టిన "ది టవరింగ్ ఇన్‌ఫెర్నో" చిత్రాన్ని సుప్రసిద్ధ సంస్థలు వార్నర్ బ్రదర్స్, ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్ కలిసి నిర్మించాయి. వార్నర్ బ్రదర్స్ వద్ద "గ్లాస్ ఇన్‌ఫెర్నో" అనే స్క్రిప్టు, ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్ వద్ద "ది ఇన్‌ఫెర్నో" అనే స్క్రిప్టు హక్కులు ఉన్నాయి. రెండిటినీ వేర్వేరు రచయితలు రాసినా – కాస్త పోలిక ఉండడంవల్ల ఆ రెండు సంస్థలూ కలిసి, ఆ రెండు స్క్రిప్టులనూ కలిపి "ది టవరింగ్ ఇన్‌ఫెర్నో"గా హిట్ చిత్రాన్ని నిర్మించాయి.

బంగారయ్య'లో
జానకి, సత్యనారాయణ





### భయానక చిత్రమా ? కుటుంబ చిత్రమా ?

రామ్సే బ్రదర్స్ "దర్వాజా" భయానక చిత్రానికి ఏంగ్‌రామ్సే నిర్మాత, శబ్దగ్రాహకుడు. అతని అన్నలు తులసిరామ్సే, శ్యామ్‌రామ్సే దర్శకులు తమ్ముడు కుమార్‌రామ్సే కథ, స్క్రీన్‌ప్లే, సంభాషణలు రాశాడు. సహకార దర్శకుడు : అర్జున్‌రామ్సే ఛాయాగ్రాహకులు గంగూరామ్సే, కేషురామ్సే నూతన నటుడుగా పరిచయం గావింపబడ్డ గోపాల్‌రామ్సే మరో సోదరుడు. వీళ్ళ తండ్రి ఎఫ్ యు రామ్సే ఈ చిత్రాన్ని సమర్పించారు.





'కటకటాల రుద్రయ్య'లో జయచిత్ర, కృష్ణంరాజు, జయసుధ

## డైరెక్టర్ రాజాచంద్ర

తొలి చిత్రమే హిట్ అయిన మరో అదృష్ట వంతుడు, ప్రతిభాశాలి డైరెక్టర్ రాజాచంద్ర. ఈయన దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాధ చౌదరి నిర్మాతగా విజయాబాపినీడు ఆధ్వర్యంలో తయారైన "బొమ్మరిల్లు" చిత్రం శతదినోత్సవం జరుపుకోబోతోంది. ఈ సంస్థ తదుపరి చిత్రంతో పాటు పి. బాబ్జీ - యు. వి సూర్యనారాయణబాబు కలిసి పద్మావతీ పిక్చర్స్ పతాకంలో నిర్మించే చిత్రానికి, పి. ఎస్. ఆర్. పిక్చర్స్ తాజా చిత్రానికి త్వరలో దర్శకత్వం వహించనున్నట్లు తెలియ జేశారు. "శతదినోత్సవాన్ని విజయవాడలో చేయాలా, మద్రాసులో చేయాలా అనే సందిగ్ధంలో ఉన్నాను. ఎక్కడైనా ఏదైనా కొత్త పద్ధతిలో చేయాలి మీరేదైనా సజెస్ట్ చేయండి," అన్నారు బాపినీడు. నాకు తోచింది చెప్పి, అక్కడ్నించి సెలవు తీసుకున్నాను.

శతదినోత్సవాల విషయంలో, చిత్రాల పబ్లిసిటీ విషయంలో మాత్రం ఏదైనా కొత్త పంథా అవలంబించాలన్న తపన ఇటీవల కనిపిస్తోంది. విదేశాలలో ఈ అన్వేషణ మరీ ఎక్కువగా ఉంది. ఆ మధ్య బి. బి. సి. వాణిజ్య విభాగంలో నిమిషంపాటు రేడియోలో ఏ ధ్వనీ వినిపించలేదు. ఆ తర్వాత ఒక అనౌన్సర్ అంటాడు కదా "మా ప్రసారానికి అంతరాయం కలిగిందనుకుంటు న్నారా? అలాంటిదేమీలేదు. రెమింగ్టన్ రాండ్ టైప్‌రైటర్లు అంత స్మూత్‌గా పని చేస్తాయన్న మాట. అందుకే మీకే నాయిస్ వినిపించలేదు..." అని. రెమింగ్టన్‌వారి పబ్లిసిటీ ఎత్తు అది. పాత గ్రామఫోన్ రికార్డులు కొనుక్కొని ఏం చేసుకుంటారోగాని రేడియోలో ఏదో కంపెనీ ప్రకటన... "అరిగిపోయిన పాత గ్రామఫోన్ రికార్డులు మాచేత కొనబడును... కొనబడును... కొనబడును" అని అరిగిపోయిన రికార్డులాగానే నిమిషంపాటు వినిపిస్తుందట.

## "ఎంకి-నాయుడుబావ" ప్రారంభోత్సవం

"ఎలా వచ్చింది బ్రదర్ పాట?" అన్నారు విజయా గార్డన్స్ రికార్డింగ్ థియేటర్‌లో రామానాయుడు. ఆయన నేతృత్వంలో సురేష్ ప్రొడక్షన్స్ సమర్పించే వెంకటేశ్ ఎంటర్ ప్రైసెస్ "ఎంకి-నాయుడుబావ" సినిమాస్కోప్ వర్ణచిత్రానికి జూలై 21న తొలి పాట రికార్డింగ్ జరిగింది. ఆత్రేయ గీతం, మహదేవన్ సంగీతం, సుశీల - బాలసుబ్రహ్మణ్యం గానం. అందుకే "పంచదార తియ్యగా ఉందా - అని అడిగినట్లుంది మీ ప్రశ్న" అన్నాను. "మీకు నచ్చిందంటే మన వాళ్ళందరికీ నచ్చినట్లే" అని ఓ విసురు విసిరి, ఆ చిత్రం గురించి వివరాలు తెలియజేశారు రామానాయుడు. శోభన్‌బాబు, వాణిశ్రీ, చంద్ర మోహన్, అల్లు రామలింగయ్య, రాజబాబు, జానకి నటవర్గం. పినిసెట్టి, జాన్సన్ రచయితలు. పాటలన్నీ ఆత్రేయ రాస్తున్నారు. సుందరం ఛాయాగ్రాహకుడు. రాజేంద్రకుమార్ శిల్ప దర్శకుడు. ఆగస్ట్ 20 నుంచి నవంబర్ వరకు ఏకబిగిన జరిగే షూటింగ్‌తో చిత్రం పూర్తవు తుంది. శ్రీశైలం, కారంచేడు ప్రాంతాలలో ఔట్‌డోర్ షూటింగ్. డి. వెంకటేశ్‌బాబు నిర్మించే ఈ చిత్రానికి బోయిన సుబ్బారావు దర్శకుడు.

## పొడుగు - పొట్టి గ్లాసులకు పేర్లు

ఢిల్లీలో ఒక కూల్‌డ్రింక్ కొట్టులో చెఱకురసం "అమితాబ్ బచ్చన్ గ్లాసు 50 పైసలు, జయబాధురి గ్లాసు 25 పైసలు" అని బోర్డు పెట్టారు.

అమితాబ్ కొడుకు అభిషేక్ సదా బొటనవేలు నప్పరిస్తూంటాడు గనుక ఆ వేలికి ఎప్పుడూ



'కాదుసుమా కథ'లో మురళీమోహన్

'సింహబలుడు'లో ఎన్. టి. ఆర్., వాణిశ్రీ



బెండేజ్ వేసి వుంచుతుందట జయబాధురి.

20-4-78న అమితాబ్ నటించిన నాలుగు చిత్రాలు "కస్మేవాదే, బేషరమ్, త్రిశూల్, డాన్"లు ఒకే రోజు సెన్సార్ చెయ్యబడ్డాయి. మొదటి రెండు చిత్రాలకు మాత్రం రెండు కట్‌లు పడ్డాయి.

# * జి. వి. జి. పేజీ *

## మారుతీ ప్రొడక్షన్స్ 4వ చిత్రం కూడా

కృష్ణ హీరోగా జి. సి. శేఖర్ దర్శకత్వంలో అడుసుమిల్లి లక్ష్మీకుమార్ నిర్మించే మూడవ చిత్రానికి ఇటీవల ఏర్కాడ్‌లో కొన్ని రసవత్తరమైన సన్నివేశాలు చిత్రీకరించారు. ఇంతలో వీరి నాలుగో చిత్రం అక్టోబర్‌లో ప్రారంభమై, నవంబర్ నెలాఖరుకల్లా పూర్తవుతుంది. మురళీ మోహన్, చంద్రమోహన్, ఒక చక్కని పాత్రలో జయమాలిని ఇంతవరకు ఎన్నుకోబడ్డట్లు డైరెక్టర్ జి. సి. శేఖర్ తెలియజేశారు. రచన, సంగీతం, ఛాయ, కూర్పు, శిల్పం శాఖలకు సత్యానంద్, చక్రవర్తి, కన్నప్ప, కోటగిరి గోపాలరావు, రాజేంద్రకుమార్ బాధ్యులు. నిర్వహణ: జాస్తి.

## త్రిమూర్తి ప్రొడక్షన్స్ కొత్త చిత్రాలు

"దొంగలవేట" అనంతరం కృష్ణ హీరోగా త్రిమూర్తి ప్రొడక్షన్స్ పతాకంలో 1979లో రెండు చిత్రాలు తయారవుతాయి. సినిమాస్కోప్ (టాడ్–ఏఓ)లో తయారయ్యే వర్ణ చిత్రానికి పి. బాబ్జి, జి. సాంబశివరావులు నిర్మాతలు కాగా–రెండో చిత్రానికి పి. బాబ్జి, యు. సూర్యనారాయణ బాబు (పద్మావతీ పిక్చర్స్) నిర్మాతలు. సాంకేతిక వర్గం మామూలే.

## సినిమా ప్రభావం

మద్రాసు మీనాక్షి మహిళా కళాశాల ఎదుట బస్‌స్టాండ్‌వద్ద కొందరు కాలేజీ విద్యార్థినులను వేళాకోళంచేసి ఇబ్బంది పెట్టారనే అభియోగంపై జయమాలిని తమ్ముడు పి. ఆర్. కుమార్ (వయసు 22) తో బాటు మరో నలుగురు యువకులను జూలై 10న కోడంబాక్కం పోలీస్ ఇన్‌స్పెక్టర్ శ్రీ ఎతిరాజ్ అరెస్ట్ చేశారన్న వార్త చాలా మందికి విస్మయం కలిగించింది.

'శ్రీరామరక్ష'లో జయసుధ, అక్కినేని





'కుమారరాజా'లో

## అస్సామీ భాషలో చిత్రాలు

అస్సామీ భాషలో ఏటా రెండే రెండు చిత్రాలు తయారవుతాయి. ఒక చిత్రాన్ని డైరెక్ట్ చేశాక ప్రతి దర్శకునికీ వేరే వృత్తి వెతుక్కోవలసి వస్తోంది. రెండు చిత్రాలకు దర్శకత్వం వహించిన డైరెక్టరే లేడక్కడ.

## హీరోయిన్ పేరు కోసం

"గది లోపల డైరెక్టర్‌గారూ, కవిగారూ స్టోరీ డిస్కషన్‌లో ఉన్నారు. ఫర్వాలేదు. మీరు వెళ్లొచ్చు" అన్నాడు ఓ నిర్మాత.

గదిలో డైరెక్టరూ, రచయితా ట్రాన్సిస్టర్ లోంచి సినిమా రికార్డులు వింటున్నారు. "ఆలోచించి ఆలోచించి మీ బుర్రలు వేడెక్కినట్లున్నాయి. రిలాక్స్ అవుతున్నారా?" అన్నాను.

"అబ్బే – అదికాదండి. మా పిక్చర్‌లో హీరోయిన్‌కు ఏదైనా కొత్త పేరు పెట్టాలని ఆలోచిస్తున్నాం. పాటలు కోరిన శ్రోతల పేర్లను వినిపిస్తారుగా? అందులో మంచి పేరేదైనా దొరుకుతుందేమోనని..." అన్నాడు రచయిత.

## చీఫ్ మినిస్టరా? చీఫ్ మినీ స్టారా?

"తమిళనాడు ముఖ్యమంత్రి ఎం. జి. ఆర్. గారు నిక్షేపంగా ఇంకా సినిమాలలో నటించవచ్చునే!" అంటూ మన ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డిగారు తాను కూడా ఒకప్పుడు కొద్దో గొప్పో నటుడంటూ వివరించారు ఇటీవల మద్రాసుకు విచ్చేసినప్పుడు.



జయప్రద, లత

★ తమిళంలో విజయవంతమైన "అన్నకిళి" చిత్రం ఆధారంగా సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో సుందర్‌లాల్ నహతా సమర్పించే "రామచిలక" రంగుల చిత్రంలో వాణిశ్రీ, రంగనాథ్, చంద్రమోహన్, కాంతారావు, రావు గోపాలరావు, సాక్షి రంగారావు, రావి కొండలరావు, జయలక్ష్మి, పల్లవి, సుధ, బేబీ బబిత పాత్ర ధారులు ఆగస్ట్ మాసంతో షూటింగ్ పూర్తి చేసుకొని సెప్టెంబర్‌లో విడుదలయ్యే ఈ విజయలక్ష్మి పిక్చర్స్ తృతీయ చిత్రానికి సముద్రాల జూనియర్ సంభాషణలకర్త సత్యం సంగీత దర్శకుడు శ్రీకాంత్ ఛాయాగ్రాహకుడు శిల్పం . సూర్యకుమార్ ప్రొడక్షన్ : మణి - మూర్తి. సహకార దర్శకులు. కె వి కృష్ణయ్య, చేకూరి కృష్ణారావు. నిర్మాత · శ్రీకాంత్ నహతా.

★ బొంబాయి శివార్లలోని 'స్టార్ థియేటర్'లో "హంటర్‌వాలీ 77" చిత్రం ప్రదర్శింపబడుతూన్న సమయంలో హఠాత్తుగా పై కప్పు కూలి పడిపోవడంతో నలుగురు ప్రేక్షకులు తీవ్రంగా గాయపడ్డారు... జైపూర్‌లోని "రాజ్‌మందిర్" థియేటర్‌కు "ది ప్రైడ్ ఆఫ్ ఏషియా" అని ప్రతీతి. ఈ హాలులో ఒక వారం అద్దె 41 వేల రూపాయలు... "షోలే" చిత్రం మూడేళ్ళ ప్రదర్శనానంతరం బొంబాయి మినర్వా థియేటర్‌లో ఆగస్ట్ 17న తీసివేస్తారు తదుపరి చిత్రం "ఆజాద్" 25 వారాలకు బుక్ చేయబడింది... ఇరవై ఏళ్ళుగా సిక్కిం



## సంక్షిప్త చిత్ర వార్తలు

రాష్ట్రంలో మొత్తం 3 సినిమా థియేటర్లే ఉన్నాయి. ఇటీవలే మరో థియేటర్ ప్రారంభించ బడింది. ఆ రాష్ట్రంలో నగరాలకు దూరంగా పల్లెలలో నివసించే నిమ్నజాతులలో చాలామందికి అసలు సినిమా అంటే ఏమిటో తెలీదు ... బొంబాయి 'డ్రైవిన్' ఆడిటోరియమ్‌లో "త్రిశూల్" చిత్రం మొదటి వారం రాబడి దాని మామూలు రాబడిని అధిగమించింది. అంటే, కారుకు సగటున నలుగురు చొప్పున పూర్తిగా నిండిపోతే అసలు రూ. 1,20,915 వసూలవ్వాలి. దాన్ని మించి వసూలు చేసింది. అంతకు ముందు "విశ్వనాథ్" ఒక వారంలో రూ.92,711 వసూలు చేసింది "కాస్మేవాడే" 13 ప్రదర్శనలకు రూ. 8,41,655 వసూలు చేసింది.

★ "ముత్యాల ముగ్గు" అనంతరం శ్రీరామ చిత్ర నిర్మించే చిత్రానికి సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు. చంద్రమోహన్, సత్యనారాయణ ప్రధాన పాత్రధారులు. డి. వి నరసరాజు సంభాషణలకర్త.

★ సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో ఎస్. బి. ఎస్. ఫిలిమ్స్ ఆగస్ట్ నుంచి ప్రారంభించే వర్ణచిత్రంలో కమలహాసన్, జయసుధ నాయకా నాయికలు. జంధ్యాల రచయిత. రాజన్—నాగేంద్ర సంగీత దర్శకులు. బాలు మహేంద్ర ఛాయాగ్రాహకుడు.

★ కే. ఏ. కిషన్ చందర్ నవల "జబ్ ఖేతీ జాగే" ఆధారంగా గౌతమ్‌ఘోష్ దర్శకత్వంలో బి. నరసింహారావు, డి. రవీంద్రనాథ్ నిర్మించే "జైత్రయాత్ర" చిత్రం నూతన నటవర్గంతో మెదక్ జిల్లాలోని దౌలతాబాద్‌లో ప్రారంభమైంది. ఛాయ : కమలనాయక్. శిల్పం · వైకుంఠం. సంగీతం : వింజమూరి సీతాదేవి.

★ కేన్సర్ వైద్యుడు డాక్టర్ బాబూరావు ఊర్మిళా పిక్చర్స్ పతాకంలో ఆర్వో కలర్‌లో నిర్మించే "డాక్టర్ జానకి" చిత్రానికి పట్టు దర్శకుడు మోహన్‌బాబు ప్రధాన పాత్రధారి. ఎన్. ఆర్. నంది సంభాషణలకర్త.

★ "దేశ్ పరదేశ్" చిత్రానికి దేవానంద్‌కు లక్ష, "త్రిశూల్" చిత్రానికి గుల్షాన్‌రాయ్‌కి రెండున్నర లక్ష రూపాయల రాయల్టీని ఆ చిత్రాలు విడుదలైన తొలి-రోజునే హెచ్. ఎం వి గ్రామఫోన్ రికార్డుల సంస్థ చెల్లించింది.

★ కృష్ణ, నాగభూషణం, చలం, రజనీకాంత్, అల్లు రామలింగయ్య, గిరిబాబు, లత, జానకి, కవిత, హలం, మాధవి, కొత్త నటి గీతతో కె. ఎస్. ఆర్ దాస్ దర్శకత్వంలో జి. డి. ప్రసాదరావు, పి. శశిభూషణ్ సెప్టెంబర్ 9న ప్రారంభించే సారథీ స్టూడియోస్ వారి వర్ణ చిత్రానికి రచన : మహారథి. గీతాలు . ఆత్రేయ, సి నా. రె, దాశరథి, కొసరాజు, వేటూరి సంగీతం : సత్యం. ఛాయ : ఎస్. ఎస్. లాల్ నిర్వహణ : కిశోర్.

## * సినిమా విశేషాలు *

### "రిక్షారాజీ"కి అనేకుల ప్రశంసలు

విజయలక్ష్మి మూవీస్ రంగుల్లో నిర్మించిన "రిక్షారాజీ" చిత్రాన్ని, పరిశ్రమకు చెందిన అనేక ప్రముఖులు చూశారు

"రిక్షారాజీ" చిత్రం ఆద్యంతం హుషారైయిన గమనంతో సాగిందని, రిక్షా త్రొక్కడంలో జయచిత్ర ఎంత నైపుణ్యాన్ని ప్రదర్శించిందో, కరుణరసాన్ని అంత విశిష్టంగా చూపెట్టిందని, ఏకగ్రీవంగా ఆమోదించారు. చిత్రంలో జయచిత్ర పాల్గొన్న దసరా పండుగదృశ్యం, రిక్షా పందెం దృశ్యం ప్రత్యేక అంశంగా వుందని, అందరూ చెప్పారు.

జయచిత్ర, చంద్రమోహన్ కలిసి నటించిన ప్రతి సన్నివేశం...నువ్వా...నేనా అని పోటీపడ్డారు అనేడి భావాన్ని కలిగిస్తుంది.

సంగీతం **కూడా** సన్నివేశ బలానికి అను**కూ**లించే విధంగా శ్రీ సత్యం సమ**కూ**ర్చడం జరిగింది

నేటివ్ పాత్రలకు ఎలాంటి మాటలు వ్రాస్తే... ప్రేక్షకులను ఆకర్షించగలవో, శ్రీ జంధ్యాల నెరవేర్చారు.

యువ దర్శకుడు శ్రీ డి. ఎస్. ప్రకాశరావు చిత్రీకరించిన "రిక్షా రాజీ" వర్ణ చిత్రం అందరినీ ఆకట్టుకునే బలీయమైన సన్నివేశాలను గొని యున్నట్టు, సినిమాను చూచిన అనేకులు వెల్లడించారు.

నిర్మాత శ్రీ జి. వి. ఎస్. రాజుకు "రిక్షా రాజీ" వర్ణ చిత్రం మాక్సిమమ్ లాభాలను తెచ్చిపెట్టగలదని, రషస్ చూచినవారు వ్యక్తం చేశారు.

"రిక్షా రాజీ" చిత్రంలో మోహన్‌బాబు, అల్లురామలింగయ్య, ప్రభాకరరెడ్డి, సారథి, హరిబాబు, నిర్మల, రోజారమణి ప్రధాన పాత్రలను పోషించారు.

### ఇతర భాషల్లో హక్కులు

విజయలక్ష్మి మూవీస్ నిర్మించిన "రిక్షా రాజీ" చిత్రానికి, విడుదలకు ముందే యితర భాషల్లో "డిమాండ్" రావడం ... గమనార్హం. తమిళంలో, కన్నడంలో నిర్మించే హక్కులను, కొందరు అడుగుతున్నారు.

### కాశ్మీర్‌లో "కుమారరాజా"

"ఆగష్టు 10 నుంచి 31 వరకూ కాశ్మీర్‌లో మకాం. అయిదు పాటలు చిత్రీకరించాలను కుంటున్నాం" అన్నారు సత్య చిత్ర అధినేతలు శ్రీయుతులు సత్యనారాయణ, సూర్యనారాయణ. ప్రస్తుతం వారు భారీ ఎత్తున నిర్మిస్తున్న సినిమాస్కోప్ వర్ణచిత్రం "కుమారరాజా" ఇప్పటికి మూడు షెడ్యూల్స్ **పూ**ర్తయిందనడం కన్నా ఇన్‌డోర్ వర్క్ **పూ**ర్తయిందనడం కరెక్ట్. కాశ్మీర్‌లో చిత్రీకరించబోయే అయిదు పాటలతో అవుట్‌డోర్ కూడా పూర్తవుతుంది. సెప్టెంబర్‌లో రీ-రికార్డింగ్ తదితర కార్యక్రమాలను **పూ**ర్తి చేసుకుని అక్టోబర్‌లో ఆంధ్రుల ముందుకు రావాలనుకుంటున్నాం అన్నారు "కుమారరాజా" నిర్మాతలు.

14 సెట్స్ వేసి "కుమారరాజా" చిత్రాన్ని లావిష్‌గా, రిచ్‌గా నిర్మిస్తున్నారు శ్రీ సత్యనారాయణ శ్రీ **సూ**ర్యనారాయణ హీరో కృష్ణ త్రిపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా గల **ఈ** రంగుల చిత్రంలో జయప్రద, లత, జయంతి నాయిక పాత్రలను పోషిస్తున్నారు. శ్రీ పి. సాంబశివరావు దర్శకత్వంలో, వి. యస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణ దర్శకత్వంలో, జంధ్యాల సంభాషణలతో, వేటూరి సుందరామ్మూర్తి పాటలతో జోరుగా, హుషారుగా సాగిపోతూంది "కుమారరాజా" షూటింగ్.



'ప్రేమచేసిన పెళ్లి'లో జయలక్ష్మి, రంగనాథ్

### పాండవులు ఎవరు ?

అనగానే ధర్మజుడు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు అనే పేర్లు చప్పున గుర్తుకొస్తాయి మనకు. కానీ నేను వ్రాస్తున్నది ఆ పంచపాండవులను గూర్చి కాదు. "మన వూరి పాండవులు" గూర్చి. "మన **వూ**రి పాండవులు" చిత్రంలో పాండవులుగా మురళీమోహన్, ప్రసాద్‌బాబు, చిరంజీవి, భానుచందర్, భాస్కర్ (ఫిలిం ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు) నటిస్తున్నారు.

రెబల్‌స్టార్ కృష్ణంరాజు సమర్పణలో జయకృష్ణా మూవీస్ పతాకంపై జయకృష్ణ నిర్మిస్తున్న ఈ చిత్రం షూటింగ్ గుమ్మళ్ళదొడ్డి, బొమ్మూరు మున్నగు ప్రదేశాల్లో ఆగస్టు రెండు వరకూ జరుగుతుంది.

శ్రీ బాపు దర్శకత్వంలో రూపురేఖలు దిద్దుకుంటున్న ఈ చిత్రానికి ముళ్ళ**పూ**డి (రచన), మహదేవన్ (సంగీతం), బాలు మహేంద్ర (కెమెరా), భాస్కరరాజు (కళ), రామచంద్రయ్య (కూర్పు) సాంకేతిక సారధ్యం వహిస్తున్నారు. కృష్ణంరాజు, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, కాంతారావు, రమణమూర్తి, శోభ, సీత, హలం, జయమాలిని, ఝాన్సీ, సుమంగళి, లక్ష్మీదేవి తదితర ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. శ్రీ యు. సూర్యనారాయణరాజు నిర్వహణలో తయారయ్యే ఈ చిత్రం లక్ష్మీ ఫిలింస్ విడుదల.

పక్కింటి పార్వతి బోలెడు
ఖర్చుపెట్టి ఇంటికి ఎమల్షన్
పెయింటు వేయించింది.
కాని నేను ఖర్చులో
20% పైగా ఆదా చేశాను.

సూపర్ డెకోప్లాస్ట్—
ఎమల్షన్ సౌందర్యానికి
పెట్టింది పేరు




"పార్వతి నన్ను అడిగుంటే ఆమె కూడా ఆదా చేసేది. మా ఇళ్లు 120 చ. మీ. వైశాల్యంతో ఒకేలా ఉంటాయి. అందంగా కన్పిస్తుందని, ఇంటికి ఎమల్షన్ పెయింటే వేయిద్దామని ఇద్దరమూ అనుకున్నాం. వేయించాం కూడాను. కాని, ఆమెకు బోలెడు ఖర్చయింది. నాకు మాత్రం 20% పైగా ఆదా అయింది. ఎలా అంటారా, అది సూపర్ డెకోప్లాస్ట్ మహత్యం!"

సూపర్
# డెకోప్లాస్ట్

ఏషియన్ పెయింట్స్

CASAP-38-244 TEL



'సీతాపతి సంసారం'లో ఒక దృశ్యం

# సినిమా

•మోహన్, మురళీమోహన్, మోహన్‌బాబు, కాంతారావు, ప్రభ, నిర్మల, జి. ఎస్. ఆర్. మూర్తి ప్రధాన పాత్రధారులు. "స్వర్గం...నరకం" చిత్రం తరువాత, శ్రీ దాసరి చిత్రంలో "పటాపట్" జయలక్ష్మి నటించడం... గమనార్హం.

ఆగస్టు 9న రికార్డింగు, ఆగస్టు 24 నుంచి షూటింగు. ఈ చిత్రానికి సత్యం సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. అన్నపూర్ణా ఫిలింస్ విడుదల.

## పెరుగుతున్న పొడుగు మనిషి

తెలుగు చలనచిత్ర రంగంలో పొడుగు మనుషులు చాలామంది వున్నారు. కానీ ప్రాముఖ్యత వున్నవాళ్లు కొద్దిమందే వున్నారు. అలా ప్రాముఖ్యత వున్న పొడుగు మనుషుల్లో మోహన్‌బాబు కూడా ఒకరు. "స్వర్గం—నరకం" దగ్గర్నుంచి ఈ పొడుగుమనిషి పెరుగుతూనే వున్నాడు. పొడవులోకాదు, నిలకడలో. శారీరకంగా కాదు, శక్తిమంతుడిగా. పబ్లిక్‌లో తనకంటూ ఒక ప్రత్యేకతను సంపాదించుకున్నాడు మోహన్. పరిశ్రమలో తనకంటూ ఒక స్థానాన్ని సముపార్జించుకున్నాడు బాబు. మిత్ర భాష చిత్రాలలో కూడా మోహన్‌బాబుకు మంచి అవకాశాలే వస్తున్నాయి. "నోము" చిత్రదర్శకుడైన పట్టు తమిళంలో దర్శకత్వం వహించబోయే చిత్రంలో మోహన్‌బాబు నాయకుడి వేషాన్ని వేస్తున్నారు. శ్రీ అచ్చయ్య నాయుడు కన్నడంలో శ్రీ రాజ్‌కుమార్‌తో నిర్మిస్తున్న చిత్రంలో అతిధి పాత్రలో కన్పిస్తారు. ఇక తెలుగులో తీసుకుంటే మోహన్‌బాబు లేని చిత్రాలను వేళ్లతో లెక్కపెట్టవచ్చు. పెరుగుతున్న ఈ పొడుగుమనిషి ఇంకా పెరగాలని, మరిన్ని చిత్రాలలో నటించాలని దీవిద్దాం.

## అక్కినేనికి కొత్తతరహా పాత్ర

లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ శ్రీ అక్కినేని నాయకత్వంలో, శ్రీ దాసరి దర్శకత్వంలో ప్రారంభించిన స్కోప్ వర్ణ చిత్రానికి, జూలై 24న, సాంగ్ రికార్డింగ్ జరిగింది.

"జానపద గేయ కవి" శ్రీ దాసం గోపాలకృష్ణ వ్రాసిన "ఉప్పుసేప పప్పుసారు" పాటను, శ్రీ జి. కె. వెంకటేష్ సంగీతంలో, బాలసుబ్రమణ్యం పాడారు. ఈ పాటను కథానాయక పాత్రధారి శ్రీ అక్కినేనిపై చిత్రీకరిస్తారు.

శ్రీ నాగేశ్వరరావు భిన్న ప్రవృత్తి గల కథానాయక పాత్రను పోషిస్తున్నట్టు, దర్శక ... కథకుడు శ్రీ దాసరి వెల్లడించారు. ఈ స్కోప్ వర్ణ చిత్రానికి కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, నాగి శిల్పాన్ని, బాలు కూర్పును నిర్వహిస్తున్నారు.

జూలై 31 నుంచి ... ఆగస్టు 13 వరకు తొలి షెడ్యూలు, సెప్టెంబర్ 20 నుంచి అక్టోబర్ 5 వరకు మలి షెడ్యూలు జరుగుతుంది.

శ్రీమతి అనురాధాదేవి నిర్మిస్తున్న యీ చిత్రంలో మురళీమోహన్, మోహన్‌బాబు, అల్లురామలింగయ్య, ప్రభాకరరెడ్డి, మాడా, 'షావుకారు' జానకి, జయచిత్ర, లత ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు

## కొత్తవాళ్లతో దాసరి సరికొత్త ప్రయోగం

శ్రీ లక్ష్మీనరసింహా ఇంటర్నేషనల్ అనెడి నూతన చిత్ర నిర్మాణ సంస్థ, శ్రీ దాసరి చిత్రీకరణలో సరికొత్త కథా సంవిధానం గలిగిన ప్రయోగాత్మక వర్ణచిత్రాన్ని ప్రారంభించడానికి నిర్ణయించింది.

ఈ సంస్థకు ఎం. కె. మావుళ్లయ్య అధినేత. అన్నారావు నిర్వాహకుడు. ప్రధాన సాంకేతిక శాఖలను కె. ఎస్. మణి, భాస్కరరాజు, సత్యం, బాలు నిర్వహిస్తారు.

"స్వర్గం... నరకం" చిత్రానికి కొత్తవాళ్లు కావాలి అని యింటర్వ్యూలు జరిపారు. అదే పద్ధతిని, నిర్మాత మావుళ్లయ్య పాటిస్తారు. ఇంతకీ చిత్రం పేరు ఏమిటో తెలుసా? "సీతాకోక చిలుక".

## కోరికలే గుర్రాలైతే!

"ఇదెక్కడి న్యాయం" చిత్రాన్ని నిర్మించిన, శ్రీ లలిత మూవీస్ నిర్మాత జగదీష్ చంద్రప్రసాద్, తన మలి చిత్రంగా నిర్మించనున్న వర్ణచిత్రానికి ఆకర్షణీయమైన పేరును పెట్టారు. "కోరికలే గుర్రాలైతే".

అగ్ర దర్శకుడు శ్రీ దాసరి కథ, మాటలు, చిత్రానువాదం, దర్శకత్వం నిర్వహిస్తున్న యీ కొత్తతరహా సాంఘిక చిత్రంలో చంద్ర



'రాముడు–రంగడు'లో ఒక దృశ్యం

## కేరళ దేశంలో
## తెలుగు 'జయ'ల ప్రణయం !

తెలుగు చిత్ర రంగంలో అగ్రశ్రేణి స్థానాన్ని అనుభవిస్తున్న జయచిత్ర ... జయసుధలు, యిటీవల కేరళదేశం వెళ్ళారు. ఎందుకో తెలుసా? వారి యిష్టప్రియులతో ప్రణయం సాగించడానికి.

"జయ" లేమిటి ? వారి ప్రణయనాధు లెవరు ? అని పాఠకులకు తెలియాలిగా

విజయమాధవీ పిక్చర్స్ నిర్మిస్తున్న 'కటకటాల రుద్రయ్య" స్కోప్ వర్ణ చిత్రానికి గాను, కేరళ దేశంలో రెండు శృంగార గీతికల చిత్రీకరణ 40 గంటలలో పూర్తి చేశారు, "ప్రజాదర్శకుడు" శ్రీ దాసరి.

అరుక్కర డామ్ వద్ద జరిగిన చిత్రీకరణలో కుమారి జయచిత్ర, శ్రీ రామకృష్ణ పాల్గొన్నారు.

కోవలం వద్ద జరిగిన చిత్రీకరణలో శ్రీ కృష్ణంరాజు ... కుమారి జయసుధ పాల్గొన్నారు. ఈ రెండు పాటలు పూర్తిగావడంతో ... రెండు ఫైట్స్ మాత్రం మిగిలాయి, అన్నారు చిత్ర నిర్వాహకుడు శ్రీ వడ్డె రమేష్

## నాలుగు జంటల కథ

"కటకటాల రుద్రయ్య" స్కోప్ వర్ణ చిత్రంలో కొన్ని విశేషాలు వున్నాయి.

ఒకటి : శ్రీ కృష్ణంరాజు రెండు పాత్రలను పోషించడం

రెండు . శ్రీమతి జమున కుమారుడుగా శ్రీ కృష్ణంరాజు నటించడం.

మూడు : శ్రీ దాసరి ఫక్తు మాస్అప్పీల్ చిత్రాన్ని రూపొందించడం.

నాలుగు : రాధాకృష్ణ నృత్య గేయం ఆధునిక పద్ధతిలో చిత్రీకరణ జరగడం.

ఈ చిత్రం నాలుగు జంటల జీవనరాగ సరాగాలపై నడుస్తుంది. శ్రీమతి జమున .... శ్రీ కృష్ణంరాజు. శ్రీ కృష్ణంరాజు ... కుమారి జయసుధ. కుమారి జయచిత్ర ... శ్రీ రామకృష్ణ. శ్రీమతి జమున ... శ్రీ రావుగోపాలరావు.

ఈనాడు ప్రేక్షకులకు ఏం కావాలో అవన్నీ "రుద్రయ్య" చిత్రంలో వున్నాయి గనుక, నిర్మాత శ్రీ వడ్డె శోభనాద్రికి, ధన వర్షం తథ్యం. ఈ చిత్రానికి జె. వి. రాఘవులు సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని నిర్వహించారు. అన్నపూర్ణా ఫిలింస్ విడుదల.

## ఎన్టీఆర్‌తో "కలియుగ రాముడు"

డాక్టర్ శ్రీ ఎన్టీఆర్‌తో "సింహబలుడు" స్కోప్ వర్ణచిత్రాన్ని నిర్మించిన తిరుపతి ప్రొడక్షన్స్ నిర్మాతలకు, ఏప్రిల్ నుంచి "కలియుగ రాముడు"గా పాత్రధారణ చెయ్యడానికి "సూపర్ స్టార్" అంగీకరించినట్టు తెలిసింది.

శ్రీ కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో రూపొందనున్న "కలియుగ రాముడు" చిత్రం కూడా స్కోప్‌లో నిర్మాణం అవుతుందని తెలిసింది.

"సింహబలుడు" స్కోప్ వర్ణచిత్రం ఆగస్టు 11న విడుదల అవుతుంది.

## అగ్రనటి నటిస్తున్న కొత్త చిత్రాలు

"ఆంధ్రుల అగ్రనటి" కుమారి వాణిశ్రీ అత్యధిక చిత్రాలలో నటిస్తున్నారు. నెలకు 30 రోజులు (రెండో ఆదివారం తప్ప) ఆవిడ వివిధ చిత్రాల షూటింగుల్లో పాల్గొంటున్నారు.

ప్రస్తుతం అందరికన్నా బిజీగా, యాక్టివ్‌గా వున్నది కూడా వాణిశ్రీగారే.

"శ్రీరామ రక్ష... రామచిలుక... శ్రీ భాస్కర చిత్ర, సింహబలుడు... సాహసవంతుడు, ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్, ప్రియబాంధవి, వీనస్ పిక్చర్స్, దేవర్ ఫిలింస్" చిత్రాలలో కళాభినేత్రి వైవిధ్యం వున్న వేషాలను వేస్తున్నారు

— జనప్రియ ★

'మాయింటి దేవత'లో ఒక దృశ్యం

# రాముడు – కోటయ్య – చిట్టోడు

ఎమ్.టి. శైలజన్న



*లోకంలోని అన్యాయాన్ని, అక్రమాలను చూసి చూసి, మునిమాపు వేళకు– మూడంతస్తుల ఆసుపత్రి భవనం ప్రక్కకు చేరిన సూర్యుడు అక్కడి "క్యాజువాలిటి వార్డ్"- రోగుల బాధకు - ముఖం ఎఱ్ఱబడి, దూరంగా వాలిపోయాడు*

అప్పుడే క్యాజువాలిటీ వార్డులో వెలిగిన దీపాలు– అక్కడ చావు బ్రతుకుల్లోవున్న- రోగుల ప్రాణాల్లా, మిణుకు మిణుకుమంటూ వుండగా– వెలిగాయి

అప్పుడే ఎమర్జన్సీ ఆపరేషను చేయటం అవసరమున్న ఓ పేషెంటు తాలూకువాళ్ళు బయట- ఎంత డబ్బు యిచ్చుకోటానికి సిద్ధంగా వున్నారో- బేరమాడుకోడానికి బయటికి వచ్చాడు, ఆ పూట డ్యూటీలో వున్న హెడ్ సర్జన్- డాక్టర్ ఆనంద్- ఎమ్. ఎస్; ఎఫ్ ఆర్ సి ఎస్; లండన్.

"బాబూ! డాక్టరుగారూ!" అంటూ కంగారుగా దీన వదనంతో, వణకి పోతూ- ఎదురొచ్చిన వృద్ధుడు రామశాస్త్రి. లోపల ఆపరేషను బల్లమీదున్న యువకుడు తాలూకు మనిషని పసిగట్టిన డాక్టర్ ఆనంద్- 'ఆ ఆపరేషను బల్లమీద వుంది మీ తాలూకు మనిషేనా? .. పాపం. మూడు ప్రక్క ఎముకలు ఫ్రాక్చరయ్యాయి! కడుపులో ప్రేగులూ బయటి కొచ్చాయి! పెద్ద ఆపరేషను చేయాలి!' అన్నాడు అతి సాధారణ ధోరణిలో- విషయం వివరిస్తూ, ముందుకు నడుస్తూ.

డాక్టరు చెప్పిన మాటలు వింటూనే రామశాస్త్రి నవనాడులు కృంగిపోయాయి ఒక్కసారి కళ్లముందు కారు చీకట్లు క్రమ్మినట్లయ్యింది అయినా ఏదో విధంగా ఆయన ఆ డాక్టరుతో, ఆయన గదిలోకి నడచి-

"డాక్టరుగారూ! ఇదిగో రూ. అయి దొందలుంచండి! ఎలాగైనా మా కోటయ్య ప్రాణం కాపాడండి!" అన్నాడు

ఆ మాటలంటుండగా- ఆయన కళ్లల్లో నీళ్లు తిరిగాయి. గొంతు గద్గదిక మైంది.

డబ్బు ముట్టడంతో డాక్టర్ ఆనంద్ ముఖంలో- ఓ వ్యాపార సరళికి అలవాటుపడ్డ ప్రసన్నత, ఆత్మీయత, ప్రత్యక్షమయ్యాయి.

'కోటయ్య మీ అబ్బాయా! ?"– అడిగాడు, డాక్టర్

"కాదు బాబు! మా.. పా.. లే...రు!"

"పాలేరా ! ? ! ? ! ?"—నమ్మలేనట్లు, ఆశ్చర్యంతో నోరు తెరిచాడు డాక్టర్.

"ఔను బాబూ! పేరుకు పాలేరైనా... వాణ్ణి నాకన్న బిడ్డకంటే మిన్నగా చూసుకుంటున్నాను! బ్రతికి చెడ్డవాడని– ఏరోజూ –వాణ్ణి -చిన్నచూపు చూడలేదు! వాడూ ఆ విశ్వాసంతోనే- నాలుగేళ్ళుగా నా దగ్గరే వుంటున్నాడు! నాకంటే ఎక్కువ కమతం యిస్తామని ఎందరు ఎన్నిరకాలుగా ఆశ పెట్టినా, చివరికి వాళ్ల కులస్తులు– పిల్లనిచ్చి యిల్లరికం వుంచుకుంటామన్నా – వాడు వాటికి లొంగలేదు! చివరికి ... ఘటన ... ఎవరు .. తప్పించగలరు !? ఈ వుపద్రవం వీడికే రావాలా ... ఇవ్వాళో రేపో రాలిపోయే నాలోటివాడికి రాకూడదూ! బాబూ! మా కోటయ్యకు త్వరగా ఆపరేషను

చేయండి! వాడి ప్రాణం కాపాడండి! దిక్కులేని.. వాడిని... ఎలాగైనా... తిరిగి... ఓ...మనిషిని... చేయండి!'' అన్నాడు, పైపంచెతో కళ్ళొత్తుకుంటూ.

"ఫరవాలేదు! కేసు కాస్త జాగర్తగా హ్యాండిల్ చేస్తే ఇంకొంచెం రాల్చే ఘటం లాగే వున్నాడు! పిచ్చి బ్రాహ్మడు!'' అనుకున్నాడు, డాక్టర్ ఆనంద్— లేచి — ఆపరేషను థియేటరు వైపుకి నడుస్తూ.

* * *

కోటయ్య తండ్రి పెదకాపు సుబ్బయ్యకు —తాతలనాటి స్థిరాస్తి- అతని హయాం వచే ప్పటికి ... యిబ్బడి ముబ్బడిగా పసిడి పంటలు పండే — చెరువు క్రింద పదెకరాల మాగాణి మాత్రం—మిగిలింది.

అయితే అయివేజుకు మించిన అప్పులు— ఆ అప్పులకు అయ్యే వడ్డీలు — వాటికోసం వ్రాసిన నోట్లు ఓ ప్రక్క కోటయ్య తండ్రి సుబ్బయ్యను— తొలిచాయి! వీటిని మించి ప్రతిఏడూ రాష్ట్ర స్థాయిలో— కోటప్ప కొండ దగ్గర జరిగే—ఎండ్ల పందేల కోసం, పందెపు గిత్తల్ని పెంచే వ్యసనం—ఆయన్ని యిల్లూ వళ్ళూ గుల చేసి వదిలాయి ఫలితంగా ఆయన లోకం వదుల తూ వదుల తూ ''రామశాస్త్రిగారూ! నా పందెపు గిత్తలు- వాటిమీద బేరం పెడితే - వింతకైనా కొంటారు! కాని, మనసున్న మారాజు- మీరైతే యిూటిని సరిగా సాక్కుంటారని మీకమ్మ తుండా! ఆ నోరులేని జీవాలతోపాటే- మాబుడ్డోడు- కోటయ్యా వుంటాడు! ఆణ్ణి మీకాడే కమతగాడిగా పెట్టుకోండి!'' అన్నాడు.

రామశాస్త్రికి, పందెపు గిత్తల్ని కొని మేపే సోమత పెద్దగా లేక పోయినా— వెనక ఎవరూ బాదర బందీ లేక పోవడం, ఆయన ఏకైక సంతానం రామకృష్ణుడు ప్రయోజకుడై పట్నంలో పెద్ద ఉద్యోగంలో వుండటంతో—''పోనీలే! రాష్ట్రస్థాయిలో జరిగే పోటీల్లో నా గిత్తలకు ప్రథమ బహుమతి వస్తే—ఆ పేరు నా వూరికి కాదా! తల్లీ తండ్రీ లేని కోటయ్యకూ- కాస్త నీడ కల్పించి నట్లుంటుంది!'' అనుకుని, గిత్తల్ని తనే కొనేశాడు.

ప్రతి సంవత్సరం, శ్రీరామనవమికి - కోటప్పకొండ దగ్గర జరిగే ఉత్సవాలలో— రాష్ట్రస్థాయిలో— ఎడ్లకు — గిత్తలకు —

ందులో—బండలాగుడులో బండిలాగుడులో ందాలు జరుగుతాయి. ఆ పందాలలో—అన్నిటి కంటే ముఖ్యంగా—పన్నెండంగుళాల పొడవు, ఆరంగుళాల వెడల్పుతో, నల్లగా నిగనిగలాడే 'మహానంది బండ'ను—యిసుకలో ఎక్కువ దూరం లాగిన గిత్తల జతకు—మూడు వేలరూపాయల నగదు బహుమతితో పాటు యిచ్చే—వెండి మువ్వల మెడపట్టెడ, బంగారు పతకం, రజిత కప్పులు—అందరికీ ఓ పెద్ద ఆకర్షణ.

కోటయ్య— రామశాస్త్రిగారి కమతగాడిగా జేరిన మొదటేడే-గిత్తలకు—'రాముడు'—'చిట్టోడు'—అన్న ముద్దు పేర్లు పెట్టాడు. రామశాస్త్రిగారి ప్రోత్సాహంతో—పెద్ద బండి మీద—యిరవై మినప బస్తాలు వేసి, మోకులతో చక్రాలు కదల కుండా కట్టి—రోజూ ఉదయమే ఓ గంట గిత్తల చేత లాగించేవాడు ఫలితంగా మరుసటి సంవత్సరమే—బండి బరువు లాగేపందేలలో, అందంలో—'రాముడు'— 'చిట్టోడు' ప్రథమ బహుమతులు పొందాయి.

"మూడోఏడు కాడి తాకించిన గిత్తలు—గుండెలు పగిలే బరువులు లాగుతున్నయ్! ఇదంతాకోటయ్య పెట్టే—'దానా'-బలం!" అన్నారు కొందరు.

"ఏం కోటయ్యా! పనిలో పని...మహానంది బండా లాగిస్తావా ఏమిటి? మూడువేల బహుమతి వస్తుంది!" అన్నారు కొందరు ప్రోత్సహిస్తూ. "అమ్మో! పసికూనలు! మహానంది బండలాగితే అయి బతుకుతయ్యా!

# రాముడు—కోటయ్య....

బాగా మేపి వచ్చే ఏడు సూద్దాం!" అన్నాడు కోటయ్య.

అన్నట్టుగానే తరువాతి సంవత్సరం 'మహానంది బండను' గోగుపుల్లలా లాగించాడు కోటయ్య. అంత కొండలాగుండే బండను పరిగెత్తే పిల్లలు నడక నేర్చుకునే మూడు చక్రాల బండిలా లాగేస్తుంటే—"తల్లి సిగతరగ! ఏందో అనుకున్నాన్రా! రాముడూ చిట్టోడూ! నీయమ్మ— మహానంది బండను లాగే 'జీవ' మీదెగ్గరుందనుకోలేద్రా! శబాష్!" అనుకున్నాడు కోటయ్య, సంబరపడిపోతూ.

జిల్లా కలెక్టరుతోపాటు రామశాస్త్రిగారి ప్రక్కన నిలబడి 'రాముడు' చిట్టోడితో చేతిలో ఎండికప్పులతో ఫొటో తీయించుకుంటున్నప్పుడు, ఆకాశం దద్దరిల్లేలా చప్పట్లు కొడుతూ శ్రీరామనవమి ఉత్సవానికి వచ్చిన లక్షలాది జనం చూపిన ఆనందాతిశయం కోటయ్య జన్మలో మరిచిపోడు.

"అందుకే గామానూ... మా అయ్య సుబ్బయ్య... ఈ చప్పట్లకోసం యీ సంబరం కోసమే .. అలా యిలూ, పల్లాగుల్ల చేసుకొని యీ పందెపు గిత్తల్ని సాకాడు!" అనుకున్నాడు,ఏదో కొత్త విషయం తెలిసినట్టు, కోటయ్య

క్రమేపీకోటయ్యకూ—ఆ గిత్తలకూమధ్య ఓ అనుబంధం ఏర్పడిపోయింది. వాటిని చూడకుండా అతను ఓ క్షణం వుండలేడు.




రామశాస్త్రిగారి పెంకుటి సావిట్లో క్రింద గిత్తలుంటే ఆ సావిటి చెక్క అటక మీద కోటయ్య ఉండేవాడు. వాటి ఆలనా పాలనలోనే అతనికో అవ్యక్తానందం లభించేది వాటితో ప్రతి క్షణం ఏదో మాట్లాడందే అతను వుండలేక పోయేవాడు.

దీనికి తగ్గట్టు రాముడిది చిన్ని తల, కాటుక రెప్పలు, దోనెలాంటి చెవులు, పిడిబాకుల్లాంటి కురచ కొమ్ములు, సింహం లాంటి రొమ్ము, మెడకు కంచుపోత పోసిన తిరుపతి మువ్వల నల్లపట్టెడ— దానికి మధ్య వెండి గంట, కుడివైపు అందంగా భారంగా వాలిన మోపురం, మనువుల మీద చక్రాల్లా గుండ్రంగా వంపులు దిరిగిన కండతో పిరుదులు, పొట్టకింద అందంగా వుండే నల్లపొడ, కొలిచినట్టు—మూడు మూరల బెత్తెడు ఎత్తు, ముద్దగిట్టలతో, బారెడు అంగవేసే తెల్లగా అందంగా వుండే రూపు.

ఒక్క ఎత్తులో ఒక బెత్తెడు కొడాతో వుండే 'చిట్టోడిది'-దాదాపు— అదే శుభ లక్షణాలతో వున్న రూపు

నాలుగెకరాల వరిగడ్డితో పాటు, పంట కాలువ మీద, దిబ్బలమీద మొలిచే పచ్చగడ్డి అదేపనిగా తెచ్చి వేసేవాడు. ఇవికాక—జనపకట్టె, ఉలవగుగ్గిళ్ళు, మడ్డికూడు, తెలగచెక్క, పెద్ద మరతవుడుతోపాటు, పిల్లిమిసరే కాక, మునిమాపు వేళల్లో చాటు మాటుగా— బ్రిరపొట్ట వరి కూడా తెచ్చి మేపేవాడు. ఇక రోజూ సాయంత్రం గోరు వెచ్చటి నీళ్ళతో బాగా కడిగి, చీకటి పడకుండానే దోమలు కుట్టకుండా పరిగడ్డి పొగ వేసేవాడు.

రామశాస్త్రిగారు అప్పుడప్పుడు ఇచ్చే రూపాయి అర్ధా చుట్టకొడ కొనకుండా, ఆ డబ్బు పోగుచేసి, దాంతో రంగు రంగుల ప్లాస్టిక్ తీగతో బొద్దు వారు తాడు నేయించి వేసేవాడు, కోటయ్య.

కోటయ్య చేతిలో, రామశాస్త్రిగారి ప్రాపకంలో, సకల రాజోపచారాలు పొందుతున్న ఆ పందెపు గిత్తల్ని చూసిన ఆవూరి జనం—"ఛీ! ఛీ! మనిషిగా యీ దిక్కుమాలిన జన్మ ఎత్తేకంటే — హాయిగా రామశాస్త్రిగారి పందెపు గిత్తలుగా

పుట్టిపుణ్ణా, దింతో సుఖపడిపోయి వుండే వాళ్ళం !''—అనుకునే వాళ్ళు యిార్ష్యగా.

కొందరు మోతుబరి రైతులైతే మాత్రం "బ్యామ్మన యవసాయం అంది వూరికేనా ! రామచాత్రిగారి చాదస్తం కాకపోతే—పందెంలో గిత్తలు గెలిత్తే ఊరికి పేరొత్తదని, సేతి సమురు యవ్వారంలోకి దిగాలా ! అయినా పెళ్లి పెటాకులు కాని బ్రహ్మచారి సన్నాసి కోటయ్య— వీట్ని సాకి రి సేత్తుండబట్టి కాని,— రేపు కోటయ్య ఓ పూట పక్కకి తప్పుకుంటే — ఆ గిత్తల్ని ఆయన ఆపూటే అమ్మి కోడూ !'' అనేవాళ్లు.

అయితే ఆ ఏడు పొలం మీద పంట వుండగా తుఫాను దెబ్బతీసింది. ఫలితంగా మొలలోతు నీళ్ల క్రింద గింజలు ఉండి పోయాయి.

"ఈ యేడు తిండికే గింజలు లేవు ! ఇక గొడ్లకు మేత కొని ఏం మేపుతాం కోటయ్యా !'' అన్నాడు రామశాస్త్రి, విస్పృహతో.

"తిండి గింజలే కరువయితే—యింక పందెపు గిత్తల్ని ఎలా మేపడం !''—ఈ ఆలోచన రాగానే కోటయ్య, నిలువెల్లా కంపించి పోయాడు.

దీనికి తోడు—తుఫాను భీభత్సం కారణంగా, శ్రీరామనవమికి—కోటప్పకొండ దగ్గర జరిగే ఎడ్లపందాలు ఆ యేటికి నిర్వహించటం లేదని పేపరులో వార్తలు వచ్చినయ్

"గడ్డికొని మనం ఏం మేపగలం !'' అనుకున్న సన్నకారు రైతులు, బీదాబిక్కీ— తమ పశువుల్ని, అయిన కాడికి తెగనమ్ము కున్నారు.

ఇక తను—తత్తర బిత్తరలాడుతూ కూర్చుంటే— పరిస్థితి యింకా విష మిస్తుందని అర్థం చేసుకున్న కోటయ్య — రామశాస్త్రితో—"బాబుగరూ ! తుఫానుకు ముందు—కుప్పవేసిన ఆ సాములు, కుప్పలు నూర్చటం మొదలెడతారు! నేనూ గిత్తలూ కూలికి పోతాం ! వాటి ఎండు మేతకైనా కాస్త గిట్టుబాటవ్వుద్ది !'' అన్నాడు.

రామశాస్త్రి "ఆ మాటలంటుంది కోటయ్యేనా!'' అన్నట్టు, ఆశ్చర్యంగా— చూసి ఓ నిముషం, ఆగి—"మహానంది బండ లాగిన గిత్తలతో—నూడుగబళ్ళు లాగిస్తావా కోటయ్యా !'' అన్నాడు నిర్లిప్తంగా. ఆ మాటల వెనక, రామ శాస్త్రి ఆవేదనను అర్థం చేసుకున్న కోటయ్య— "మనులు మాన్యాలు పోయినా— మా రాజులు—యిాల్ల మనసులు, మా దొడ్డయి !'' అనుకున్నాడు—కోటయ్య.

చివరికి తనే కూలిపనికి వెళ్ళి, ఆ వచ్చిన ఆదాయంతో అస్తుబిస్తుగా 'రాముడికి'— 'చిట్టోడికి' మేత అమర్చుకోవడం ప్రారంభించాడు.

పొలాలలో నీళ్ళు తగి, నేల ఎండి— నూర్పిడికి కళ్లాలు—సిద్ధం అయినపుడు, నూర్పిడికి బంతికి తోలే గొడ్ల జతకు— దినిమిది మానికల వడ్లు—యివ్వాలనే కట్టుడి జరగటంతో, అందరిలాగే—రామశాస్త్రి కలవరపడి పోయాడు.

"వర్షంలో తడిసి, చివికిన గడ్డితొక్కే గొడ్లకి—నాలుగు మానికల వడ్లా ! ఈ లెక్కన—నూర్పిడి చేస్తే వచ్చే—ఆ చారెడు గింజలు, కూలికే చాలవే !'' అన్నాడు విస్పృహతో.

అప్పటికి అక్కడే వున్న కోటయ్య "ఎందుకులెండి బాబూ! మనదెంత లు గెకరాలచెక్క! మనఎండిపోయిన పెదలకొమ్ము గేదెనీ, దాని పెద్ద పడ్డనీ, మనరాముణ్ణీ— చిట్టోణ్ణీ— కలిపి బంతి కడదాం! అంతగా రెండు రోజులు పడితే పట్టనియ్యండి! మన సొంత పనేగా!'' అని, రామశాస్త్రి సమా ధానం కోసం, ఎదురు చూడకుండా, పాని టోని గొడ్లని తోలుకు రావటానికి పరి గెత్తాడు.

"బండ్లు ఓడలు—ఓడలు బండ్లు'' అన్న సామెత, తన కళ్ళముందే నిజమవు తున్నట్టు — "రాముడు '— 'చిట్టోడు' నూర్పిడి బంతులు తిరగటానికి, రావటమా! ఏమిటో విధి వైపరీత్యం!'' అనుకున్నాడు. రామశాస్త్రి.

కాస్సేపటో కోటయ్య అన్నట్టుగనే చెదలుకొమ్ము గేదె, దాని పడ్డతో పాటు— రాముడు— చిట్టోడు. బంతి తిరగటానికి కళ్లంలోకి దిగాయి.

నీళ్లలో తడిసి, చివికిన ఎండుగడ్డి పనలు కసబిసలాడుతూ నారసాగి, పాలిపోయి నట్టు తెల్లగా బూజు పట్టిన కల్లంలో దిగిన రాముడు— చిట్టోడు— "ఇది మా పనికాదు!'' అన్నట్టు కాలు ముందుకు కదపకుండా నిలబడి పోయాయ్.

కోటయ్యకు ఆశ్చర్యం వేసింది

"పాపం! బతికి సెడ్డోడు, బతకడం కష్టం! అంది, మీ అసంటోల్లని సూసేరా! రాముడూ— నువ్వు ముందు కద్రలా!'' అన్నాడు, కోటయ్య, రాముడి తోక మీద చేత్తో, అదిలిస్తూ.

"ఉహూ ! నేనా... యిా పాడు పనులు చేసేది!'' అన్నట్టు తల విదిలించాడు రాముడు.

కోటయ్యకు మొట్టమొదటిసారి, చికాకు వేసింది. పైగా రామశాస్త్రికి ఇష్టం లేక పోయినా, తన పంతంమీద, వాటిని బంతి



తిరగటానికి దింపాడు. ఇప్పుడు అవి "నప్పే మిరా—!" అంటున్నాయి

"అరేయ్! రాముడూ— చిట్టోడా— కదలండిరా! మీకే చెప్పేది... ఊ... కదలండి!" అన్నాడు, గిత్తల తోకలు, బలంగా మెలితిప్పుతూ— కోటయ్య.

అయినా, అవి యింకా నిర్లక్ష్యంగా తలాడిస్తూ, గడ్డి మూతితో వాసన చూస్తూ ఈసడించుకుంటూ, అసహ్యంగా, ప్రక్కకు ప్రక్కకు తప్పుకున్నాయి.

అంతే కోటయ్యకు తల కొట్టేసినట్లయింది.

## రాముడు-కోటయ్య....

వెంటనే కోటయ్య చేతిలో పసిగ్గర వేగంగా గాలిలోకి లేచి పిడుగులా రాముడి వీపుమీద, చిట్టోడి వీపుమీద—వాలింది.

రాముడు, "అంబా!" అని దీనంగా, మోరయెత్తి అరచాడు. కాని ఒక్క అడుగు ముందుకు వేయలేదు. చిట్టోడు, బాధతో, భయంతో దూరంగా పరిగెత్తాడు.

కోటయ్య కోపంతో పిచ్చివాడై పోయాడు. ఆవేశంలో వళ్ళు మరచి, రౌద్రాకారం దాల్చిన హిరణ్యకశిపుడిలా "అరేయ్! రాముడూ! నాయాల — నీకు యివ్వాళ నా చేతిలో చావు మూడింది! నీ రగతం కళ్ళసూడకపోతే — నా పేరు కోటయ్యేకాదు!" అంటూ బిగ్గరగా అరుస్తూ, దెబ్బమీద దెబ్బ, కొడుతూ — పిడుగుల వర్షం కురిపించాడు.

అయినా గుళ్ళో దేముడిలా 'రాముడు' —అన్ని దెబ్బలూ తిట్లూ— భరిస్తూ — మూగగా వుండిపోయాడు.

రామశాస్త్రితో పాటు కల్లంలో వున్న కూలీలు అక్కడికి "కోటయ్యా! కోటయ్యా!" అంటూనే వున్నారు, ఏం ప్రమాదం వాటిల్లుతుందోనన్న భయంతో.

అయినా కోటయ్య ఆగలేదు. నిప్పులు చెరిగే కళ్ళతో, ఆవేశం, ఉద్రేకం, కోపం, అవమానం ఏకం కాగా, పళ్ళు పట పట కొరుకుతూ, చేతి కండరాల్లో బలమంతా కూడదీసుకొని— పసగ్గరతో, రాముడి తల మీద బలంగా ఒక్క మోదు మోదాడు.

అంతే—బాకు లాంటి కొమ్ముకు తగిలిన ఆ కర్ర—'ఫట్' మని, విరిగి, ఓ తుంపు బాణంలా వెళ్ళి, రాముడి మెడికంటి పై కొసన గుచ్చుకుంది.

ఆ నొప్పికి తల్లడిల్లిపోయిన రాముడు "పూ"—అంటూ, ఒక్కసారి మోర వంచి, ఎదురుగా వున్న కోటయ్య డొక్కల్లో—ఒక్క కుమ్ము కుమ్మి, ఎత్తి కుదేశాడు.

జరిగిందేమిటో వూహించే లోపు, కోటయ్య రక్తపు మడుగులో పడి గిల గిల తన్నుకుంటున్నాడు.

ఆ దృశ్యం చూసిన రామశాస్త్రికి,కోపం ఆగలేదు. "కడుపు కాల్చుకుని వాడు మీకు తిండి పెడుతుంటే, తిని కొవ్వెక్కి—వాడినే పొడుస్తావా! నీ అంతు తేలుస్తాను!" అంటూ, చంద్రాకోలతో, వళ్ళు తెలియని ఆవేశంతో వొగరుస్తూ, రాముడి వీపు మీద దెబ్బకొకవాత తేలేట్టు కొట్టడంసాగించాడు.

ఇక ఆ చంద్రాకోల దెబ్బల బాధ భరించ లేక ఒక్కసారి "అంబా!" అని అరిచాడు రాముడు.

అప్పటికే కల్లంలో పనిచేయటానికి వచ్చిన కూలీలు కోటయ్యని చేతుల మీద ఎత్తుకొని వూళ్ళోకి బయలు దేరారు. కోటయ్యకు మెల్లిగా స్పృహ తప్పుతున్నది.

చెంద్రాకోల దెబ్బలకు వంటి మీద అప్పటికే రక్తం చెమర్చటంతో—రాముడు ఆబాధకు తట్టుకోలేక మళ్ళీ దీనంగా





"అంబా !" అన్నాడు. జరిగిందేమిటో అర్థంకాని చిట్టోడు, తనూ గొంతు కలిపి "అంబా !" అన్నాడు.

కోటయ్య ఎందుకో కళ్ళు తెరిచి చూచాడు.

రామశాస్త్రి చేతిలో చండ్రకోల దెబ్బలు భరించలేక మూగగా "అంబా !"—అని అరుస్తున్న-రాముణ్ణి, భయపడి దూరంగా వుండి అరుస్తున్న 'చిట్టోణ్ణి' చూసేరికి, ఆ స్థితిలోవున్న కోటయ్య "పంతులుగారూ! రాముణ్ణి చంపమాకండి ! రాముణ్ణి చంపమాకండి !" అంటూ అరుస్తూ, ఆకూలీల చేతుల్లోంచి వదలించుకొని, ముందుకు రాబోయి, రాలేక-అక్కడే మొదలు నరికిన మానులా కూలి పోయాడు.

* * *

గవర్నమెంట్ హాస్పిటల్‌మంచి తొమ్మిది నెలలకు కోటయ్య బయటపడ్డాడు. అతను, యింకా ఓ నెలకు హాస్పిటల్‌నుంచి బయట పడతాడనగా, ఓ రోజు ఉదయం రామశాస్త్రి కొడుకు హాస్పిటల్‌కు రావటం చూసి, ఆశ్చర్యపోయాడు.

అంతకు క్రితం, రోజు విడిచిరోజువచ్చే రామశాస్త్రి- ఓ రెండు వారాలు వరుసగా రాకపోవటం, ఇప్పుడు ఆయన ఏకైక వారసుడు—రామకృష్ణవచ్చాడు.

"కోటయ్యా !..."—అని ఏదో చెప్ప బోయి-గొంతుపూడుకు పోయి, మాటలు పెకలక, కన్నీళ్ళు కుక్కుకున్నాడు— రామకృష్ణ

"ఏంది బాబూ ! అయ్యగారేరి ! ఆరు ఏందుకు బాబూ—యీ మధ్య...రావటం లేదు ?" అన్నాడు.

"నాన్న నిన్ను చూడటానికి యిక రాడు కోటయ్యా ! ఆయనపోయి వారం అయ్యింది !" అన్నాడు, రామకృష్ణ—తల వంచుకొని, కన్నీళ్ళు కుక్కుకుంటూ.

"ఏంది బాబూ !? ఏమిటి మీరు చెప్పేది !?...దేముడులాంటి అయ్యగారు... పో...యా...రా !? !?" అన్నాడు తలమీద పిడుగు పడ్డట్టు—అరుస్తూ

"ఔను కోటయ్యా! ఇదిగో యీ వెయ్యి రూపాయలు నీ కిమ్మన్నాడు నాన్న! పందెపు గిత్తల్ని- మీ కులస్తుడే— ఏం. ఎల్. ఏ. రంగయ్య కొన్నాడు. మవ్వు హాస్పిటల్‌మంచి డిశ్చార్జి కావటంతోటే నిన్ను— ఏమ్.ఎల్.ఏ రంగయ్య, గిత్తల దెగ్గర పనికి పెట్టు కుంటానికి ఒప్పుకున్నాడు. నిన్ను ఎవరు పనిలో పెట్టుకుంటానంటే వాళ్ళకి మాత్రమే గిత్తల్ని అమ్ముతానని నాన్న పంతంపట్టి—చివరికి ఎంతో నష్టానికి అమ్మాడు ! సరే గతం గతః పోనీ... నిన్ను యింకో నెలరోజులు హాస్పిటల్లో వుంచేం దుకు అవసరమైన ఏర్పాటు చేశాను ! వస్తాను !" అంటూ వెళ్ళిపోయాడు, రామకృష్ణ.

డొక్కలో మూడు ఎముకలు తీసివేయ వలసి రావటంతో, కోటయ్య. ఓ ప్రక్కకు వంగి, చేతికర్ర వూతగా నడుస్తున్నాడు. తొమ్మిది నెలలుగా పెరిగిన గడ్డం, తలతో, ఏ పని లేకుండా ఎప్పుడూ పడుకొని వుండ టం, పైగా దేవుడు లాంటి రామశాస్త్రి చనిపోయాడన్న వార్త—ఇవన్నీ కలిపి అతనికి యిప్పుడు యిరవైనాలుగేళ్ళంటే ఎవరూ నమ్మరు ! నలభై రెండంటే నమ్ముతారు.

తొమ్మిది నెలల తరువాత, సాటి కులస్తుడి దెగ్గర, 'దేహి'—అంటూ వచ్చిన కోటయ్యను చూసి — ఏమ్. ఎల్. ఏ రంగయ్య, జాలిపడ లేదు.

"రామశాస్త్రి చస్తూ చస్తూ— నిన్ను పనిలో పెట్టుకోమని ప్రమాణం చేయించు కున్నాడని—నిన్ను పనిలో పెట్టుకుంటుండా! బుడ్డ కమతగాడికిచ్చే గింజలు కొలుస్తా ! ఇష్టమైతే పనిలో కుదురు ! ఆ గిత్తలకాడి పనితో సరిపుచ్చుకుంటే కుదర్దు ! ఆ!" అన్నాడు, అధికార దర్పంతో. కోటయ్య మారు మాట్లాడకుండా — 'రాముడు'- 'చిట్టోడి' కోసం పనిలోకి కుదిరాడు.

తొమ్మిది నెలల తరువాత కోటయ్యను చూసి గుర్తుపట్టిన గిత్తలు — పొరుగూరు వెళ్ళి చాలా రోజుల తరువాత తిరిగి వచ్చిన తల్లినిచూసి సంబరపడి—'అమ్మా—అమ్మా' —అని అరచినట్టు— 'అంబా—అంబా'— అని అరుస్తూ, కట్టుతాళ్ళు తెంపుకుంటాయా అన్నట్టు, కోటయ్య చుట్టూ సంబరపడుతూ తిరిగినయ్.

"మనుషుల్లో లేని ఆప్యాయత మీలో నన్నా వున్నాయ్ ! ఏందిరా— 'రాముడు' 'చిట్టోడు' ఇలా చిక్కిపోయారు!" అన్నాడు కోటయ్య మృదువుగా, వాటి తల నిమురుతూ.

అయితే ఆ సాయంత్రం పందేల గిత్తలకు —ఎమ్. ఎల్. ఏ— రంగయ్యగారు వేసేది— రెండు జనపకట్టలు, ఓ అడ్డెడు చిట్టు తప్ప- యింకేమీ అదనంగా లేదన్నప్పుడు, 'రాముడు'— 'చిట్టోడు' — అలా ఏందుకు చిక్కిపోయాయో అర్థం చేసుకున్నాడు, కోటయ్య.

"దేముడు! రామశాస్త్రిగారు చచ్చి ఏ లోకంలోవున్నాడో !బిర్రుపొట్ట వరిపంట, మోపులు మోపులు కోసి మేపినా— చూసీ చూడనట్టు ఊరుకునేవాడు ! ఈ మేపలేని రంగయ్యకు — పందెపు గిత్తలెందుకో ! అమ్మేస్తే పోలా ! పేరుగొప్ప ఊరుదిబ్బ!" అనుకున్నాడు- కోటయ్య పళ్ళు పట పట కొరుకుతూ.



# వారఫలం

మహేష్

**18-8-1978 శుక్రవారం మొదలు**
**24-8-1978 గురువారం వరకు**

మేషం :- వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

వృషభం :- స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

మిధునం :- ప్రయాణాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

కర్కాటకం :- సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు బంధువులకు చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

సింహం :- నూతన వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి ఆందోళన కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

కన్య :- వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం అఖరిలో ఫలితంలేని శ్రమ కలుగుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

తుల :- సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

వృశ్చికం :- మీ కార్యక్రమాలు అడాపుడిగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

ధనుస్సు: వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

మకరం : ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

కుంభం : మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. రావలసిన డబ్బు అందుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మీనం : వృత్తిలో యెవరిని విశేషంగా నమ్మడం తగదు. ప్రయాస కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

---

## రాముడు కోటయ్యా....

అనుకోని విధంగా—రెండోరోజు ఉదయమే —చావు కబురులా—"రేపు మన గిత్తల్ని, సిలోనోళ్ళు కొనుక్కు పోతున్నారు తెల్లా రేపటికి బెంజీ లారీ వస్తుంది!" అన్నాడు. విస్తు ఎల్ ఏ—రంగయ్య

ఆ మాటలు విన్నకోటయ్యకు లోకమంతా శూన్య మనిపించింది తనకు యిక 'నా' అనేవారెవరున్నారు—అనిపించింది. ఆపూట తిండి సహించలేదు ఏదో తెలియని-దిగులు—భయం—చెప్పుకోలేని ఆవేదన! ఇంట్లో ఉండలేక, బయటికి నడిచాడు.

"సిలోనోళ్ళు— మనకంటే బాగా మేపుతార్రా కోటయ్యా! పైగా మన గిత్తల్తో —యిలాంటి రాముళ్ళను—చిట్టోళ్ళను—పుటిస్తార్రా! దాంతో మన గ్రామం పేరు విదేశాల్లో సైతం మారుమోగిపోద్ది!"—ఎవరో అన్నారు

"మన గిత్తల్ని లక్షరూపాయాలకమ్మా డంట్రా—ఎమ్మెలే రంగయ్య! నాయాలు కాలాంతకుడు!" అన్నారు మరెవరో.

"రేపీపాటికి-మనూరి పేరు- పేపరు- పై పేజీల్లో— మారు మోగిపోద్ది!" ఎవరో అనుకుంటున్నారు. అన్నట్టుగానే రెండోరోజు ఉదయం బెంజి లారీ వచ్చింది. లైబ్రరీ అరుగుకు ఆనించి లారీ నిలిపారు లారీ లోపల నాలుగుమోపుల ఎండుగడ్డి పరచారు. లారీ కుదుపులకి— గిత్తలు పడకుండా, పరిచి బాదులు, యిటు అటు అడ్డంగా పరచి, మోకులతో కట్టారు.

ఈలోపు వూళ్ళోవున్న ఆడా —మగా— చిన్నా పెద్దా— తీర్థప్రజల్లా లారీ దగ్గర చేరారు. ముత్తయిదువలు గిత్తల మదుట, కుంకుమ బొట్లు పెట్టి— హారతి పట్టారు. కొందరు గిత్తల మెడల్లో పూలదండలువేసి వీపులమీద గులాం చల్లారు. కోటయ్య— అంత వరకు జేబులో దాచుకున్న కొబ్బరి కాయ దిష్టితీసి పగల గొట్టాడు. లారీ కదిలింది. వెళుతూ వెళుతూ గిత్తలు కోటయ్యవంక దీనంగా చూశాయి.

"మీరన్నా దొరల్లా బతకండిరా!" అంటూ కన్నీళ్ళతో కోటయ్య దండం పెట్టి అక్కడినుంచి కదిలాడు! రెండో రోజు— తుఫాను భీభత్సంలో వరదపాలైన పందెపు గిత్తల వార్త వినకముందే— కోటయ్య శవం పెద్దమోటు బావిలో తేలింది

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

## శ్రీ చావలి వెంకటశాస్త్రి

ఇల్లు చూచి ఇల్లాలి సంగతి తెలుసుకోవచ్చు అనేది సామెత. ఇల్లాలినేకాదు; ఆ ఇల్లాలివల్లభుని స్వభావ సద్భావాలూ తెలుసుకోవచ్చునని నా అభిప్రాయం. ఇది ఇటీవలమరింత దృఢపడింది. అదొక సుమారయినదివాన్‌ఖానా (డ్రాయింగ్ రూము). ఒకవైపు వర్తులాకారమైన బల్లమీద ధ్యానముద్రాంచితమైన బుద్ధ విగ్రహం. దానికి దగ్గరగా తూర్పు ముఖంగా రేడియో, దక్షిణ ముఖంగా ఒకవైపు గోడలో నాలుగైదరల పుస్తకాలషెల్ఫు. తూర్పుగోడకు ఆనుకొని తెల్లటి పరుపుతో మంచం. బుద్ధవిగ్రహం ముందు దీవాన్‌ఖానా మధ్యన గుండ్రటి బల్ల, రెండుమూడు కుర్చీలు. దానిచుట్టూ. బుద్ధ విగ్రహానికి కుడివైపున ముగ్గురుకూర్చునే సోఫా. పుస్తకాల షెల్ఫులో ఆర్థిక, గణితశాస్త్ర గ్రంథాలతోపాటు, తత్త్వశాస్త్ర గ్రంథాలు ప్రాచ్య పాశ్చాత్య మహాకవుల, రచయితల రచనలు. ఇది మిత్రులు శ్రీ చావలి వెంకటశాస్త్రి స్వభావ సద్భావాలకు అద్దంపట్టే దీవాన్‌ఖానా (డ్రాయింగ్‌రూము). పరిసరాలు ప్రశాంతతకు ఆలవాలమయిన శివం ప్రాంతపు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కాలనీ. శ్రీ చావలి వెంకటశాస్త్రి అంటే సాహిత్య వేత్తలకు అంతగా తెలికపోవచ్చు. "వెంచాశా" అంటే చప్పున జ్ఞాపకంవస్తారు. ఇతివృత్త వైవిధ్య విరాజిత కథానికా సందోహంతో, తత్త్వచింతగ కుండిల కవితా కదంబంతో సహా. అవును పేదలోననేమి పెన్నిధిగల దయ్యా–అనే తత్త్వం చావలి వారిది. కనుకనే, రహస్యంగా సాహిత్య సేవ చేద్దామని వెంచాశా అయారు. చావలివారి తండ్రి శ్రీ కృష్ణయ్యగారు, నరసారావుపేటలో అడ్వొకేటు. కొలవెన్ను రామకోటేశ్వరరావు సంపాదకత్వంలో వెలువడిన త్రివేణి ఆంగ్ల పత్రికకు ప్రారంభోత్సవం జరిపిన వారు శ్రీ కృష్ణయ్యగారు. ఆ సాహిత్య సంస్కృతి సంస్కారం వెంచాశాలో పరిణతి పొందింది. నరసారావుపేటలో విద్యార్థిగావున్నప్పుడే స్కూలు పత్రికకు సంపాదకులుగా వున్నారు. 18వ ఏటే భారతిలో తొలికథ పడింది..పొరపాటు అన్నయ్యా 1944లో ఇంపీరియల్ బ్యాంక్‌లో గుమాస్తాగా చేరారు. ఈ లెక్కలవారిని చూస్తే సాహిత్యం పిక్కబలం చూపుతుందంటారే, ఇదేమిటి సరజనాత్మకతచేపట్టిందే వెంచాశాను–అనుకొనేవాడిని. కాని, లెక్కలలో మొక్కలీడయినవానికి సహేతుకతేకాక, కాల్పనికతకూడ కొల్లగా వుంటుందని తిలకుగారు వ్రాసినది చదివిన తర్వాత ఓహో అనుకున్నాను. వెంచాశా కలం పట్టినకాలం ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలం. బర్మాకొండి శీకులు, యుద్ధ క్షతనిహతులు, యుద్ధ దుష్పరిణామ బాధాసర్పదష్టులు, వికలాంగులు విధవలయిన సైనిక సీమంతినులు–అబ్బ!–ఇదంతా వెంచాశా మనస్సును మథించింది. అసలే లెక్కల మనిషి. అనువంశికంగా వచ్చిన న్యాయశాస్త్రదృష్టి. తత్త్వదృష్టి. నవకవులయిన బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం వంటివారిసాహచర్యం. వెంచాశా లేఖిని బహుముఖాలుగా విజృంభించింది. ఆయన మనస్తత్త్వ పరిశీలన, తత్త్వద్వక్పథం, వైవాహిక జీవితం. వివిధవృత్తుల రహస్యాలు వెల్లడిచేసే కథానికలు, నవలలు, కవితలు, గేయాలు. వ్రాశారు. కథలు దాదాపు 200 వుంటాయి. వెంచాశా ఆశావాది. నిరాశలనేది ఏకోశానా లేదు. రచనలలోగాని, జీవితంలోగాని, ఈ ఆప్టిమిజమె ఆయనను. శ్రద్ధాళువును– విజ్ఞానవంతుణ్ని చేసి బి.ఎ. పట్టభద్రుని. సి.ఎ. ఐ.ఐ.బి. మున్నగు బ్యాంకింగు శాస్త్రపరీక్షలలో ఉత్తీర్ణుని చేసింది. గుమాస్తాగిరినుంచి, రీజియనల్ మేనేజర్ పైహోదాను మెట్టుమెట్టుగా చేరవేసింది. మానవత్వం తొణికిసలాడే మూర్తిగా తీర్చిదిద్దింది. జైలు కిటికీకి అవల నీలసముద్రంతప్పమరొకటి కానని అండమాన్ ఖైదీ జీవితం చిత్రించే–కిటికీ అవతల, పోస్టుమార్టంకోసం శవాలను కోసికోసి తత్త్వవేత్త అయిన హరిజనుని కథ–వేదాంతి, భార్యకు చీరకొనలేకపోయినా, వృత్తిగా షోరూం బొమ్మలకు విలువైన చీరలు కట్టే–సేల్స్‌మాన్, ప్రతివృత్తికోసం దోపిడీకిగురి అయ్యే అభాగ్యులు–భోక్త, భగవానులు. ఊరందరికీ బ్రోకరుగా ఇళ్లు కుదిర్చినా, తనకునిలువనీడలేక శ్మశానంలో తలదాచుకొనే వ్యక్తి–సెమిత్రీ అవతలి సిమెంట్ మెడ, ప్రతివాని అరిగిన చెప్పులపైపు, కలాలున్న జేబులపైపు చూపులు సారించే–చెకువా (చెప్పులు కుట్టేవాడు), కబాచే (కలాలు బాగు చేసేవాడు), ప్రపంచం కోసం ఒకటిగా. ప్రవర్తించే–కొనిషి (మనిషికివికృతి). సైనికాధికారివాడే వస్తువులతోనే అతని జీవితాన్ని ఆవిష్కరించిన–చెకా. చేక (చెక్కరాలు, చేతికర్ర) ఇలా ఎన్నైనా కథలను ఉదాహరించవచ్చు. పజిల్స్ వ్యసనం వర్ణించే–గళ్ల కాయితాలలో రక్తపు పిలుపు, మూడుతరాలు చూచిన బట్లరు జీవితం ఇతివృత్తమైన–మనిషిరంగు అనేవలలూ వ్రాశారు. ఏది వ్రాసినా, ఆలోచన మౌలికం. ఇతివృత్తం నిత్యజీవితం, కథన విధానం అనిదంపూర్వం ఏ ప్రభావమూ పడని శుద్ధ కల్యాణ కేదారం. వెంచాశా సాహిత్యం వెంచాశా బ్యాంకు ఇన్‌స్పెక్టరుగా ఉత్తరభారతంలోని ఐదారు రాష్ట్రాలు తిరిగారు. హిందీ, తమిళం. కన్నడం మున్నగుభాషలు మాట్లాడగలరు. ఉద్యోగ రీత్యా ఇండియా స్టేట్‌బ్యాంకిలో ఎన్నోముఖ్య పదవులు నిర్వహించి, ప్రస్తుతం రీజియనల్ (ఖమ్మం, తూర్పు, పడమర గోదావరి జిల్లాలు) మేనేజరుగా





21 సాయంకాలం ఏలూరుకు 12 కిలోమీటర్ల దూరంలోగల కొత్తూరు జగన్నాథపురం అనే గ్రామంలో నల్లసత్యం అనే అతని యింటిపై 500మంది సాయుధులు దాడిచేసి— బయట గొళ్లెంపెట్టి యింటికి నిప్పు పెట్టారు. ఇంట్లోవున్న వారిలో 3సం.ల పసిపాప సహా ఆరుగురు సజీవ దహనమై పోయారు. స్థానిక హోటలు ఒకదానిలో అంతకు క్రితం— రెండు కప్పుల కాఫీని నాలుగు భాగాలుచేసి యివ్వ నిరాకరించిన సంఘటనకు ప్రతీకారంగా యీదాడి, దహన కాండ జరిగాయని దినపత్రికలలో పడ్డవార్తలు తెలుపుతున్నాయి. పై చిత్రంలో యీ దహన కాండకు గురియైన యింటినీ ఆ యింటి లోపలదుర్మరణం పాలైన వారి భౌతిక కాయాలను చూడవచ్చును.

వున్నారు. వెంచాళా గుంటూరులో సుగృహీత నామధేయులు శ్రీ అడివి బాపిరాజుగారి వద్ద చిత్ర లేఖనం నేర్చుకొన్నారు. ఫొటోగ్రఫీలో ను. టెన్నిస్‌లోను చాల అభిరుచివుండడంవల్ల వాటిలో పెక్కు బహుమతులు సంపాదించారు. టెన్నిస్‌లో సౌత్ ఇండియన్ ఛాంపియన్‌గా ఉన్నారు. చెప్పడం మరచాను. వెంచాళా కథలన్నీ చిత్రగుప్త, ప్రజాబంధు, ఆనందవాణి, భారతి, తెలుగుస్వతంత్ర, చిత్రాంగి, సుభాషిణి, కథాంజలి, ఆంధ్రప్రభ, యువ, ఆంధ్రజ్యోతి మున్నగు పత్రికలలో ప్రచురితమయ్యాయి. ఆయన నటుడు గూడ. సాంఘిక నాటకాలలో వివిధ పాత్రలు ధరించారు. ఆ మధ్య రవీంద్రభారతిలో ప్రదర్శితమయిన స్వయంవరం నాటకంలో తండ్రి పాత్ర ధరించి ప్రేక్షకులకు ఆనందం కలిగించారు. ప్రస్తుతం వెంచాళా మనిషిలోనిమనిషి వ్యక్తిత్వం వివరణ ఇతివృత్తంగా బిహేవియర్ సైన్స్ ఆధారంగా కొత్తనవల వ్రాస్తున్నారు. "మనిషి భావాలు యథా తథంగా రికార్డు చేస్తాను" అన్నారు ఆయన. వెంచాళా సంతృప్తి తొణికిసలాడే గృహస్థు. నలుగురుకుమారులు, ఇద్దరుకుమార్తెలు. ఆయన మనస్తత్వానికి అనుగుణంగా తత్వ చింతనపరాయణ శ్రీమతి సీతామహాలక్ష్మి ఆయన సతీమణి. యోగవాసిష్ఠం మున్నగు ఉద్గ్రంథాలు ఆ యిల్లాలికి నిత్యపారాయణాలు. రచనాభిరుచిని కలిగించిన శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిని, ప్రచురించి ప్రోత్సహించిన శ్రీ ఎన్.జి. వెంచాళాను ఆయన ఆదరంతో స్మరిస్తారు. వెంచాళా వివిధ శక్తులు మేళవించిన అపూర్వ వ్యక్తి. ఆయన కథలు కనీసం 20 సంపుటాలన్నా అవుతాయి. ఆ సంపుటాలు వెలువరించాలని, నవలలు పూర్తి చేయాలని కోరుతున్నాను. "మొదేవియా రోమన్ టేల్స్" అని వ్రాశాడు. భాగ్యనగరంలోని తెలుగు వారి జీవితం వర్ణించే భాగ్యనగర కథలు వ్రాద్దామని వుంది" అన్నారు. అవి సమకాలిక సాంఘిక జీవితానికి సాహిత్య మణి ముకురాలవుతాయి. ఆంధ్రావళి వాటికోసం ఎదురు చూస్తున్నది.

రాష్ట్రపతికి సంగీతనాటక అకాడెమీ సత్కారం :

రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీమతి నాగరత్నమ్మ సంజీవరెడ్డి గౌరవార్థం రాష్ట్ర సంగీత నాటక అకాడమీ జూలై 12 వ తేది సాయంకాలం రవీంద్ర భారతిలో సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటుచేసి, రాష్ట్రపతి దంపతులను, శ్రోతృ ప్రేక్షకులను తనియింపజేశారు. శ్రీమతి వేదవతీ ప్రభాకరరావు లలిత సంగీతంతో ఈ కార్యక్రమం ప్రారంభమయింది. శ్రీమతి వేదవతి మృదుమధుర కంఠంతో డాక్టర్ అడివిరాల విశ్వం, డాక్టర్ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ పాలగుమ్మి విశ్వనాథం గేయాలు ఆలపించారు. తర్వాత సుప్రసిద్ధ సినీతార శ్రీమతి జమున సత్యభామగా, ప్రముఖ సినీతార కుమారి ప్రభ కృష్ణుడుగా కన్నాంబ స్మారక నాట్యమండలివారు కృష్ణతులాభారంలోని 'సత్యభామ అలుక' దృశ్యాన్ని ప్రదర్శించారు. శ్రీమతి జమున పాడిన "మింజాలగలడా నా యానతి వ్రతవిధాన మహిమన్ సత్యాపతి" అనే పాట అర్థ శతాబ్ది తెలుగు నాటక ప్రేక్షకులను ఉర్రూతలూపిన స్థానం నరసింహారావు పాటతో పోల్చినవారికి ఆశాభంగం కలిగింది. అనంతరం హైదరాబాద్ సంగీత నృత్య కళాశాల విద్యార్థినీ విద్యార్థుల బృందం కళాశాల ప్రిన్సిపాలు కుమారి శ్రీరంగం గోపాలరత్నం దర్శకత్వాన శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి సుప్రసిద్ధ గేయం "నా దేశం నా దేశం భారత దేశం" భావుకతతో, ఆవేశజనకంగా పాడారు. పిదప కుమారి సరళ అర్ధనారీశ్వర నృత్యాన్ని గొప్పగా ప్రదర్శించారు. అర్ధనారీశ్వర నేపధ్యంతో కుమారి సరళ, కుడికాలితో తాండవం ఎడమ కాలితోలాస్యం రౌద్ర శృంగార రసస్ఫోరకంగా నృత్యం చేశారు. శ్రీ బత్యేపపు సూర్యప్రకాశశర్మ నాట్యాచార్యత్వం వహించారు. శ్రీయుతులు మారెళ్ల కేశవరావు, నత్వ శ్రీరామ శర్మ, యుగళ వాయులీన వాదన ప్రదర్శనం చేశారు. ఇద్దరూ మహా సాధకులు, గొప్ప విద్వాంసులు. దానికితోడు బంగారుకు తావి అబ్బినట్టు సంగీత నాటక అకాడెమీ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. వి. సుబ్బారావు మృదంగం రక్తికట్టక ఉంటుందా? చివరిది హైదరాబాద్ సంగీత నృత్యకళాశాల అధ్యాపకులు శ్రీ గోపాల్ రావ్ భట్ దర్శకత్వంలో ఆ కళాశాల విద్యార్థినీ విద్యార్థులు నందిలకోతల జానపద నృత్యం మనోహరంగా ప్రదర్శించారు ఇలాటి దక్కని కార్యక్రమం ఏర్పాటుచేసినందుకు సంగీత నాటక అకాడెమీ అభినందనీయం.

ఉపశ్రుతి :—

కీర్తిశేషులు కళాప్రపూర్ణ బిరుదాంచితులు, మహాకవి శ్రీ నాయని సుబ్బారావు ఎంత సరస గంభీరులో అంతటి హాస్య చతురులు గూడ. ఆయన హాస్యం చాల సున్నితమైంది. ఆయన సతీమణి పేరు శ్రీమతి హనుమాయమ్మ. ఆమెకు సినిమాలంటే చాల ఇష్టం. దాదాపు రోజూ సినిమాలకు వెళ్ళడం పరిపాటి. ఇది చూచి నాయనివారు తమ పిల్లలతో అన్నారట— "మీ అమ్మ పేరును సినిమాయమ్మ అని మార్చేద్దామా?"—అని. మరొక సంఘటన నగరంలో నీటి ఎద్దడి రోజులు. నల్లాలలో నీరు రావడం లేదు. పక్కింటావిడ వీళ్ల యింట్లో నీళ్లు వచ్చాయేమోనని నల్లాను తిప్పి చూచి వెళ్ళిపోయారట. ఎందుకు వచ్చిందావిడ?—అని అడిగారట ఎవరో. "నలపరామర్శం" అన్నారట నాయనివారు. ఆవిడ పేరు శ్రీమతి దమయంతి.

సాయంత్రం ఆరు గంట లవుతోంది.

నేను గది గుమ్మము వద్దే నిలబడి చూస్తూ వున్నాను. ఇది నిజమేనా. నేను చనిపోయానా ? ఇది అబద్ధమని అనుకోవడానికి కూడా వీలు లేకుండా ఉంది. ఎదురుగా నా కళ్ల ఎదుట హాలులో నా శరీరము నిర్జీవంగా పడుకొని ఉంది. ఇన్నాళ్లూ ఈ అరవై ఏళ్లూ నేను ఆ శరీరముతో ఉన్నా నన్న మాట. ఒక గంటసేపు నుంచి ఎన్నో సార్లు నేను ప్రయత్నించాను, నా శరీరము లోనికి చేరుకోటానికి. కాని ఏదో అదృశ్య శక్తి నాకు అడ్డుపడ్తోంది. ఇంతకు ముందుసారి ఎన్నోమాట్లు నేనిలా బయటికి రావడము, మళ్లీ ఏమాత్రము కష్టం లేకుండా నా శరీరము లోనికి చేరుకోవటం ఎన్నోసార్లు జరిగింది. కాని నే నిప్పుడు ఈ పని చేయలేకపోతున్నా నంటే దేవుడు నన్ను నా శరీరములో నుండి శాశ్వతంగా విడదీశా డన్నమాట. అంటే నా శరీరము ఈ ప్రపంచానికి చచ్చిపోయిందన్నమాట. ఇంతకు ముందు ఎంతో చెప్పారు. శరీరము పోయినా ఆత్మ అక్కడక్కడే తిరుగుతూ వుంటుందని. ఇప్పుడు తెలిసొచ్చింది. ఔను! ఇప్పుడు జ్ఞాపక మొస్తోంది. నాకు మధ్యాహ్నము రెండు గంటలప్పుడు అకస్మాత్తుగా గుండెల్లో నొప్పిరావడము, నా భార్య శాంతి నా గుండెలను నిమురుతూ ఆత్రంగా నా కళ్లల్లో చూడడము వరకూ గుర్తుంది. ఆయిన తర్వాత లీలగా డాక్టర్ నన్ను పరీక్షించినట్లు జ్ఞాపకముంది. అంతే నేను శరీరములో నుంచి బయట పడ్డాను.

ఒక్క నిమిషము ఆలోచనలను ఆపి ఆత్రంగా అక్కడ జరుగుతున్న దృశ్యాలని చూస్తున్నాను. ఎదురుగా శాంతి గుండెలను బాదుకొంటూ నా శరీరముపై బడి ఏడుస్తోంది. చుట్టు ప్రక్కల నుండి వచ్చిన ఆడవారంతా ఆమెను మామూలు మనిషిని చేయడానికి ఎంతో ప్రయత్నిస్తున్నారు. నాలోనూ దుఃఖము ముంచుకొస్తోంది. గట్టిగా అరిచాను. "శాంతీ... ఏడ్వవద్దు, నేనిక్కడనే ఉన్నాను. నిన్నువదలి వెళ్ళను శాంతీ... నీ కళ్ళల్లో నీళ్ళను నేను చూడలేను."

అరిచేదేమో అరిచాను, కానీ నామాటలు వాళ్లకు వినపడదని నాకు తెలుసు. గంట




నుండి ప్రయత్నిస్తున్నాను. విన్నోసార్లు శాంతి చేతులను పట్టుకొన్నాను. నాచేతులు ఆమె చేతుల్ని గట్టిగా పట్టుకొన్నట్టు అన్పిస్తోంది. కానీ నిజంగా నే నా పనిని చేయలేక పోతున్నానని నాకు తెలుస్తోంది. చుట్టు పట్లనుండి వచ్చిపోయే స్నేహితులనూ బంధువులను గుర్తింపగల్గుతున్నాను. కానీ వాళ్ళతో మాట్లాడలేక పోతున్నాను. ఎంత అశక్తత. కళ్ళెదుటే నా జీవితాన్ని నలభై ఏళ్ళుగా పంచుకొని నా సుఖదుఖాఃల్లో భాగము పంచుకొన్న అర్ధాంగిని చూస్తూ కూడా మాట్లాడలేని పరిస్థితి.

పక్కింటి సుందర రామయ్యగారు నా మూడవ కొడుకును అడుగుతున్నాడు "ఏరా మీ అన్నయ్యలకూ, అక్కకూ టెలిగ్రాములు ఇచ్చారా ?"

గోపాలం కళ్ళుతుడుచుకొంటూచెప్పాడు ఇప్పుడే ట్రంకాలు చేసాము బాబాయ్. ఇంకో నాలుగు గంటల్లో అందరు వచ్చేస్తారు" అన్నాడు.

నా మిగతా ఇద్దరు కొడుకులు రవి, రమణ ఉద్యోగల్లో స్థిరపడ్డారు పెద్దవాడు రవికి ఇద్దరు మగపిలలు. రమణకు గత సంవత్సరమే పెళ్ళైయింది. కూతురు లక్ష్మికి ముగ్గురు పిల్లలు. అందరూ దగ్గర్లోనే ఉన్నారు, వస్తూంటారు ఈపాటికి. లక్ష్మి అంటే తనకు ప్రాణము. గోపాల్‌ను ఇంకా సరియైన దోవలో పెట్టకనే నేను చనిపోయాను. కానీ అతని అన్నలిద్దరూ తప్పక ఏదో మార్గము చూపెట్టకపోరు.

నా బాధల్లా శాంతి గురించే ఆమె నుదుటి కుంకుమ చెదిరింది. తల్చుకొంటేనే భయమేస్తోంది గాజులు లేని చేతులతో, బోసి మెడతో నుదట మాయమైన బొట్టుతో శాంతి ఎలా బ్రతుకగలదు ఇన్నాళ్ళు నాతో ఎంత తీరిగా తిరిగేది. అందమైన భార్యను, దానితోపాటు మంచి గుణశీలిని నాకు జీవిత భాగస్వామినిగ ఇచ్చినందుకు నేను విన్నోసార్లు దేవునికి కృతజ్ఞతలు తెలుపుకొన్నాను. అయినా జీవితములో ఎవరో ఒకరు ముందు పోవల్సిందే. నాకు ఒక్కటే ధైర్యము. నా బిడ్డలు మంచివారు. వాళ్ళ కోసం నేను వున్న ఆస్తినంతా కరగబెట్టి వాళ్ళను ప్రయోజకులను చేసాను. అరే అప్పుడే పది గంటలవుతోంది ఎవరో మేడమెట్లెక్కి వస్తున్నారు అదిగో రమణ, రవి ఇద్దరూ కలిసేవచ్చారు మళ్ళీ వెంట కోడళ్ళు, బిడ్డలు.

"అమ్మా ఏం జరిగిందమ్మా ఉన్నట్టుండి...నాన్న మొన్నటివరకూ బాగనే ఉన్నారే" అంటూ ఇద్దరూ ఏడ్వసాగారు. కోడళ్ళిద్దరూ శాంతి ప్రక్కన చేరారు.

ప్రక్కింటి రాజారావు చెప్తున్నాడు. "రవీ మీ నాయనకు ఉన్నట్లుండి మధ్యాహ్నము హార్ట్ అటాక్ వచ్చింది"

ఒక గంటసేపు ఏడుపులతో గడిచిపోయింది. ఇంతలో లక్ష్మి, అల్లుడు ప్రకాశ్ వచ్చి చేరారు. నాకు ఒకటే సంతృప్తి. అందరూ వచ్చారు. అందరూ నా కోసం ఎంతో విలపిస్తున్నారు. నిజంగా నేనెంతో అదృష్టవంతుణ్ని. శాంతికిక భయములేదు. అందరూ ఆమె నెంతో ఆప్యాయంగా చూసుకొంటారు.

ఇంతలో ఎవరో నా భుజాన్ని తడిమారు. వెనక్కు తిరిగి చూచాను. ఎవరో ఒక ఆరడుగుల అపరచిత వ్యక్తి నవ్వుతూ నిల బడ్డాడు. "ఎవరు నీవు" అన్నాను

చిన్నగా నవ్వాడతను. అతని నవ్వులో ఎంతో ముగ్ధతవుంది. "నాదు రామయ్యా ... నేను నిన్ను తీసుకెళ్ళేదానికి వచ్చిన దూతను. నీ వింక ఇక్కడ ఒక గంటసేపు ఉండవచ్చు అంటే భూలోకవాసుల లెక్క ప్రకారము పది రోజులు. మన లెక్క ప్రకారము, మానవుల ఒక్క సంవత్సరము మనకు ఒక రోజు అవుతుంది నేను మళ్ళీ వస్తాను. ఇంతలో ఏమేమి చూడాలనుకొంటున్నావో గానుకో" అంటూ గాలిలో తేలిపోతూ అదృశ్య మయ్యాడు

నా గుండెలు గుబగుబ మంటున్నాయి. ఇక్కడ ఇంకా ఒక గంట మాత్రం కళారా నూ వాళ్ళను చూసుకోవాలి. చెవులారా వాళ్ళ మాటలను వినాలి.

## 2

# ఆత్మ సాక్షాత్కారం

మాత చెప్పినట్లు కాలం చాలా జోరుగా జరిగిపోతున్నట్లనిపిస్తోంది. తెల్లవారింది. తెల్లవారక మునుపే నాకు దగ్గర వుండే మట్టాలందరూ వచ్చి చేరారు. నా కళ్ల ముందే, నేను చూస్తుండగనే, నా శరీరము కాలిపోయింది, నా శరీరాన్ని తనివితీరా తడి మాను. నాకు ఎన్నో కష్టాలతోపాటు ఎన్నో సుఖాలను కూడా చవిచూపింది. నేను చేసిన మంచి కార్యాలు, నేను తెలిసి చేసిన, తెలియక చేసిన ఎన్నో పాపపు పనులను కూడా దాచిపెట్టుకుంటూ నిస్వార్థినవలే, నా శరీరం కాలి బూడిదయిపోయింది.

నా కొడుకులు తమ కర్తవ్యం నిర్వర్తించారు. శ్మశానంలో అంతా వెళ్లిపోయాక కొంచెం సేపు కూర్చొన్నాను. ఇప్పుడు నేను — మామూలు మనుష్యులనే కాక — నాలాగ ప్రేతాత్మ రూపాల్లో తిరుగుతున్న మిగతా జీవులను చూడగల్గుతున్నాను; నాకు వాటిని చూసి భయం కావడంలేదు; ఉన్నట్లుండి జ్ఞాపక మొచ్చింది;

నాకు చాలా కొంచెము వ్యవధి మాత్రమే ఉంది. వెంటనే నా ఇంటి వైపు నరుగెత్తాను. నేనిప్పుడు చాలా వేగంగా పోగల్గుతున్నాను. కన్ను మూసి తెరచేంత లోపల ఇంట్లో ఉన్నాను. అరె! ఏదురుగా క్యాలండర్ ప్రకారము నేను చనిపోయి అప్పుడే ఐదు రోజులయిపోయింది. అంటే ఏదో ఆలోచనలో నేను శ్మశానములో ఎక్కువసేపు కూర్చొన్నానన్నమాట. ఇంట్లో నేనుండే గదిలో నా ఫోటో ముందు నాభార్య శాంతి కూర్చొని ఉంది. ఆమె కళ్ళు ఏడ్చి ఏడ్చి ఎర్రగా ఉన్నాయి. ఏదో ఆలోచిస్తూ చేతివ్రేలితో నేలమీద వ్రాస్తోంది. ఏమిటో అది. నేను జాగ్రత్తగా గమనించసాగాను. మొదట రవి అని వ్రాసి చెరిపివేసి, మళ్ళీ రమణ అని వ్రాసి మళ్ళీ చెరిపి వేసింది. అంటే తన భవిష్యత్తు ఏమిటో శాంతి ఆలోచిస్తుందన్న మాట. ఔను వీరంతా ఏరి. మెల్లిగా వసారాల్లోంచి మరో గదిలోనికి ప్రవేశించాను. ఆశ్చర్యంగా ఉంది. తలుపులు మూసేవున్నా నేను లోనికి ప్రవేశించగల్గుతున్నాను! లోపల రవి అతని భార్య రాధ ఏదో మాట్లాడుతున్నారు. పిల్లలు ఒక మూలగా పడుకొని నిద్రపోతున్నారు. "అంటే మీ నాన్నగారు ఏమి ఆస్తి వదలి పోలేదన్నమాట. ఉన్నప్పుడు ఉగాది లేనప్పుడు ఏకాదశి. పిల్లలు గల వాళ్ళము. మళ్ళీ మీ అమ్మగారినీ, గోపాలునీ తీసుకెళ్తే మనము ఇబ్బందులు పడవలసి వస్తోంది. ఇప్పటికే మన చేతినుంచి నాల్గు వందలు ఖర్చయింది—" అంటూ ఆగింది రాధ. "ష్...! మెల్లిగా మాట్లాడు, అమ్మను మనము వద్దంటే ఎట్లా"— "అంతా మీ తలమీద వేసుకోండి. మీ తమ్ముడు రమణకు ఇప్పటి వరకు బిడ్డలులేరు. హాయిగా ఆలు మగలిద్దరే. వాళ్ళను ఈ భారాన్ని నెత్తిన వేసుకోమన రాదూ. ఇప్పుడే చెప్తున్నాను. మీరు మీ వాళ్ళను ఇంటికి పిల్చుకొని వస్తే నేను పుట్టింటికి వెళ్ళిపోతాను" అంటూ ముసుగు తన్ని పడుకొంది రాధ.

అంత వరకు కొంచెము బిగువు చూపుతున్న రవి మెల్లిగా తల మీద దుప్పటి తీసి "అట్లా కోప్పడవద్దు రాధా నీవు చెప్పి నట్లే చేస్తాను" అంటూ ఆమె మీదికి వంగాడు.

నేనిక ఏమి చూడదలుచుకోలేదు. వారు మాట్లాడిన ప్రతిమాట నా గుండెల్లో గుచ్చుకోసాగాయి. ఎంతో మంచిగా కనబడిన నా పెద్దకొడుకేనా ఈ మాటలంటున్నది. పోని వినికైనా బుద్ధిలేదా. ఏడికంటే రమణే మేలు. నేను రమణను వెతుకుతూ బయల్దేరాను.

రమణా, అతని భార్య ఇద్దరూ పెరట్లో అరటి చెట్టుక్రింద కూర్చొని ఉన్నారు. "పాపము అత్తయ్యను చూస్తుంటే జాలేస్తుంది. ఈ పదిరోజులు గడచిన తర్వాత

అత్తయ్యను గోపాల్‌ను మనవెంట తీసుకెళ్దామండి'' అంది ప్రవీణ.

ఈమాటలు విన్న నేను చాలా ఉప్పొంగిపోయాను. పోని నా శాంతి వీళ్ళ దగ్గరైనా సుఖపడుతుంది ఇంతలో రమణ గడ్డిపరకను నోటితో కొరుకుతూ మెల్లిగా అన్నాడు "చూడు ప్రవీణా మనకు పెళ్ళయి ఇంకా సంవత్సరమైన నిండలేదు. ఇంకా ఏకాంతంగా మనము ఎన్నో అనుభవించాలి. వీళ్ళను పిలుచుకెళ్తే, మన ఏకాంతము భంగము కావడమే కాకుండా మనకుడబ్బులకు కూడా ఇబ్బంది అవుతుంది. ఇలాంటి బాధ్యత లన్నీ ఎప్పుడూ పెద్దకొడుకుకే. వాడిదగ్గరనే ఉండని. నెలకు ఏ యాభైయ్యో పంపిస్తే సరిపోతుంది.''

ఈ మాటలు వింటున్న నాకు భూమి బ్రద్దలవుతున్నట్టు అన్పించసాగింది. కన్నతల్లిని భారంగా భావించే ఈ పుత్రుల్ని నేను ఎందుకు కన్నాను. ఎన్నోసార్లు నేనూ, నా శాంతి పస్తులుండి వారి కడుపులు నింపామో ఎన్ని ఇబ్బందులకు ఓర్చి వారిని ఈ స్థితికి తీసుకొని వచ్చామో - వారికి తెలిసివుంటే ఈ మాటలు మాట్లాడే వారేనా! ఒకపూట పిల్లలకు కడుపు నిండకపోతే ఎన్ని గంటలు శాంతి కళ్ళలో అశ్రుధారలు ప్రవహించేవో నాకు తెలుసు. ఛీ! ఛీ! ఈ కష్టాలతో ఏ అనాథలనో పెంచివుంటే వీరికంటే ఎక్కువ కృతజ్ఞతలు కల్గివుండేవారేమో!

నా మనస్సు చెడిపోయింది. వెంటనే హాలు దాటి నా గదివైపు పోసాగాను. ఇంతలో వసారాలో రేడియో దగ్గర లక్ష్మి, ప్రకాష్ కనబడ్డారు. వాళ్ళు తెల కాగితము మీద ఏదో వ్రాసుకొంటూ వున్నారు. నేను మెల్లిగా అక్కడికి వెళ్ళి వ్రాసుకొన్న వివరాలు గమనించసాగాను. నా కళ్ళు గిర్రున తిరుగసాగాయ్. దానిలో శాంతి వొంటిమీద ఉన్న నగల వివరాలున్నాయి. ప్రకాష్ చెప్తున్నాడు "లక్ష్మీ! మీ అమ్మ ఆ గదిలో ఒంటరిగా ఉన్నది. అడిగేదేదో ఇప్పుడే అడిగెయ్. ఉన్న ఈ కొంచెము నగలు కూతురుకి నీకు కాక ఇంకెవ్వరికీ దక్కకుండా చూచుకో. ఎంతలేదన్న ఐదారువేలనగలు.''

"ఔనండీ. నాయన ఎలాగూ పోయారు. ఇప్పుడే మనము అడగకపోతే వదిన లిద్దరూ తీసుకొంటారు.''

నాలో సహనము నశించింది. నేను చనిపోయి ఐదు రోజులు కాకముందే పరిస్థితి ఇలాగుంది. ఇక ముందు ఏమేమి జరుగబోతుందో.

"శాంతీ! నన్ను క్షమించు. మనుష్యుల మనస్సులు ఇలా ఉంటాయని తెలిస్తే నేను చనిపోయే ముందే నిన్ను చంపేసేవాణ్ణి. ఇద్దరమూ కలసి ఈ పాపపు ప్రపంచానికీ, కలుషిత మనస్సులకూ దూరముగా వెళ్ళిపోయే వాళ్ళము. ఇప్పుడు ఏమీ చేయలేని పరిస్థితిలో ఉన్నాను. భగవాన్! నేనేమి పాపము చేసాను'' అంటూ వాపోయాను.

ఇంతలో నా ప్రక్కన అలికిడి అయి తల త్రిప్పి చూశాను. దూత వచ్చివేసాడు. "రావయ్యా ఇంకా కొంచెము వ్యవధివుంది. నేనుంటాలే'' అన్నాడు. నేను వెంటనే దూత చేతులను గట్టిగా పట్టుకొన్నాను. "మీ పేరేమో నాకు తెలియదు. ఒకటి మాత్రము నాకు తెలుసు. మీరు నన్ను పిలుచుకొనివెళ్ళేందుకు వచ్చిన దేవదూతలై ఉండాలి. దయచేసి నన్ను తక్షణము మీ వెంట తీసుకెళ్లండి. ఇక్కడ ఉండి మనుష్యుల మనస్సులలో ఉండే విషపు ఆలోచనలను నేను వినలేకున్నాను. అరవై ఏళ్లలో ఎంతో నేర్చుకొన్నాను. కాని నేర్చుకొన్నది శూన్యమని తెలుసుకొన్నాను: ఈ స్వార్థపరుల మధ్య నేనింక ఉండలేను. దయచేసి నన్ను వెంటనే తీసుకెళండి......పదండి'' అన్నాను; దూత నవ్వాడు. "సరే! నీ ఇష్టం. పదా!'' అంటూ నా చేయి పట్టుకొని ముందుకు సాగాడు. కడపటి సారిగా శాంతి వంక చూసి మనస్సులో గొణుగుకొన్నాను. "శాంతీ! త్వరగా వచ్చేయి. నేను నీ కోసమే కాచుకొని ఉంటాను.''

దూతతోపాటు అతివేగంగా నేను ఆకాశములో పైపైకి ఎగరసాగాను. మానవాళికి దూరమౌతున్న కొద్దీ ఇంతకు ముందు నాలో ఉన్న వ్యామోహము తగ్గిపోసాగింది ఏదో తెలియని హాయి, వింత అనుభూతి నాలో ప్రవేశించాయి. నాలో కల్గుతున్న మార్పులను చూసి దూత నవ్వాడు. ఆ నవ్వులోని చల్లదనానికి నేను పరవశించిపోతూ, స్వార్థరహితమైన లోకము వైపు అతనితోపాటు సాగిపోసాగాను.

# యువతరం

ఏడాది క్రితం కార్టూనులు వేయడం ప్రారంభించిన కందాళ భావన్నారాయణ అర్థశత కార్టూన్ ప్రచురణ మహోత్సవం చేసుకున్నాడు. కార్టూన్లు పత్రికల్లో పడాలని ఎంతో కృషిచేస్తున్న భావన్నారాయణ విజయవాడలో యింటర్మీడియేట్ యీ ఏడాది పూర్తిచేస్తాడు. మంచి వినయంగా మాట్లాడుతాడు. తెలియని విషయాలు తెల్సుకుంటాడు. "కార్టూనిస్టుగా'' మాత్రమేగాక "క్యారమ్స్'', "క్రికెట్'' ఆటల్లో కూడా ప్రావీణ్యం సంపాదించాలనుకుంటున్న 18 సం.ల "భావన్'' కి యిప్పుడే గవర్నమెంటువారు చట్టంచేసి ఆపుచేస్తున్న "వరకట్నం'' — తన పెళ్ళి కాలందాకా వుంటుందన్న నమ్మకం లేదుట!! "అప్పటికి యీ ఆచారమే పోతుందేమో? యిక నేనేం అభిప్రాయం చెప్పగలను'' అన్నాడు గడుసుతనంగా — విద్యార్థులకి రాజకీయాలతో కొంచెం సంబంధాలు చాలునన్నాడు. "బాపూ'' తీసిన సినిమాలంటే చాలా



యిష్టం భావనకి. "బాలి'' "బాబు'' అంటే కూడా చాలా గౌరవం యిష్టం — అంతేనా హిందీని రాజభాషగా స్వీకరిస్తున్నాడు యీ భావిభారత పౌరుడు — హిందీ నేర్చుకుంటున్నాడు కూడా.

సినిమాలను కేవలం వినోదం కోసంగాక వాటిల్లో "మంచి'' "నీతి'' లాంటివి వుంటే గ్రహిస్తాడు 'భావన్'' ఇంటర్‌లో క్లాసువచ్చేలాగ చదువుకుంటాడని ఆశిద్దాం.

***

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# రాగద్వేషాలు

(13 వ పేజీ తరువాయి)

'పిల్లతల్లి అన్యకులస్థురాలైనా ఫరవాలేదు' అన్నారు.

ఇంకేం, ఈ సంబంధం తప్పకుండా అయితీరుతుంది. ఇంకే ఆటంకాలూ వుండవు. వాళ్ళకికావల్సినంతా ఇస్తాడు, తను! అడిగిన కోరికలన్నీ తీరుస్తాడు! ఇంకే కారణానా ఈ పెళ్ళి ఆగదు!

పిల్లని చూసి తప్పకుండా ఒప్పుకొని తీరుతారు వాళ్ళు! తనకి తెలుసు.

ఫారిన్‌లో వున్నవాడు భర్త కావాలని ఇందిరకోరిక, అది తీరబోతోంది!

తన కోరిక సరేసరి!

వెంటనే ఇందిర ఫోటో పంపించారు రావుగారు.

వాళ్ళ వాళ్ళబ్బాయి ఫోటోపంపించారు.

అబ్బాయి ఆనంద్ చూడముచ్చటగా వున్నాడు! 'ఒకవారంలో అబ్బాయి వస్తున్నాడు, వాడు రాంగానే పిల్లని చూడడానికి వస్తాం'— అని రాశారు వాళ్ళు.

ఈ లోపల జాతకం పంపించమన్నారు. వెంటనే జాతకం పంపించారు రావుగారు. జాతకాలు చాలా బాగా కుదిరినాయని రాశారు వాళ్ళు.

ఇట్టే వారం రోజులూ గడిచిపోయాయి!

అన్నరోజుకి పిల్లవాడితో అతడి తల్లీ, తండ్రీ పెళ్ళిచూపులకి వచ్చారు.

రావుగారు ఈ సారి ఎక్కువ హడావిడి చెయ్యలేదు.

ఇందిర కూడా సింపుల్‌గా అలంకరించుకుంది.

నిరాడంబరంగా జరిగిపోయినాయి పెళ్ళిచూపులు.

ఇందిరని, ప్రైవేట్‌గా మీట్ అయి కాసేపు మాట్లాడాడు ఆనంద్. ఇందిర నచ్చిందని ప్లెయిన్‌గా చెప్పాడు! ఇందిరకి ఆనంద్ చాలా నచ్చాడు.

నొక్కుల జుట్టు, పచ్చని ఛాయా, ఆకర్షణీయమైన విగ్రహం, కాంతివంతమైన కళ్ళూ, ముఖ్యంగా ఆ ఇంగ్లీషు ఉచ్చారణ, గంభీర కంఠస్వరం, ఇందిర్ని ముగ్ధురాల్ని చేశాయి.

(ఇంకా వుంది)